శ్రీ ర స్తు.

కడపతాలూకా గంగాయపల్లె మటంలోయుండె

మణువంశస్తులయిన మూర్తెమ్మగారిచే

రచితమైన

# సహస్రార వర్ణన అనే
# వేదాంత యక్షగానము.

ఇయ్యది

కడప తాలూకా వొల్లూరు మజరా

గంగాయపల్లెలో యుండే

బసిరెడ్డి శేషారెడ్డిగారిచే

మచాన్

బి. వి. రంగయ్యశెట్టిగారి

స్వకీయ,

శ్రీలక్ష్మీనృసింహవిలాస ముద్రాక్షరశాలయందు

ముద్రింపించి ప్రచురింపఁబడియె.

ప్రతివెల 3-2-1914 రు 0 12-0

మిదుతూరు సరాబు
చిన్నసుబ్బయ్య కొమారుడు
గురుమూర్తి విశ్వబ్రహ్మ
గ్రంథకర్త పరమభక్తుడు.

బశిరెడ్డి దుగ్గన్నగారి
వేంకటసుబ్బయ్య కొమారుడు శేషయ్య
కాపు గ్రంథకర్త
ప్రియశిష్యుడు.

సైయ్యద్ అమ్మసాబు కొమారుడు
ఇమాంసాబు
మహమ్మదీయ గ్రంథకర్త
పాదసేవకుడు.



ఓం.

వీరాచార్యాయ - వీరగురువే

ఓం వీర బ్రహ్మణే నమః

# సహస్రారవర్ణన అనే వేదాంతయక్షగానము.

---

శ్రీపోతులూరు వీరబ్రహ్మణేనమః శ్రీజగద్గురువైన అప్పాయ పల్లె సుబ్బగురు బ్రహ్మణేనమః శ్రీకాళికాదేవి వరప్రసాదియైన సూక్ష్మ మూర్తి అనే అమ్మగారు సుబ్బగురుస్వామిగారి పాదపద్మములు శిరసా వహించి పదివేల నమస్కారములు అర్పించి తన ఆత్మను అఖండముగా బెట్టి వారి నిజశిష్యుయైన గంగాయపల్లెలోవుండె సూక్ష్మమూర్తి అనె అమ్మగారు చెప్పంబడిన కావ్యము యేమంటె యక్షగానముగా చెప్పడమైనది. గాన సహస్రార వర్ణన వివరించుచున్నాము. తెలిసేది అవిఘ్న మస్తు శుభమస్తు శ్రీశారదాంబాయనమః.

సీసపద్యములు.

సీ॥ మణిమను వంశమందునదీపకళికమై
ధరణిలో వెలయునాకాంతిమెరయా ।
అచ్చమాదేవి గర్భమునందు జన్మించి
సూక్ష్మమూర్తనేపేరు శుభముగాను ।
తండ్రిగురుమూర్తి సద్గురుడె దైవముమాకు
సానగగోత్రంబు సూత్రమిదియు ।
గురుసూత్రమునుబట్టి గోత్రంబులోబెట్టి
గోత్రంబు సూత్రంబు నేత్రమునను ।
చూచి అనుభవమాత్మలో చూటిగాను ।
కొల కీర్తించి పెద్దల ప్రస్తుతించి ।
జ్ఞానకొలను ఆత్మలో సమస్మరించి ।
యక్షగానంబు కృతియునే నాచరిస్తి ॥

సీ॥ గురుదేవ నీనామ మెత్తి తలచిన యపుడె
గాఢమౌ మోహంబు గోలిపోవు।
గురుదేవ నీనామ మెత్తి తలచిన యపుడె
భవభంధపాపముల్ బాశిపోవు।
గురుదేవ నీనామ మెత్తి తలచిన యపుడె
భవరోగ మరణమై మశనమవును।
గురుదేవ నీనామ మెత్తి తలచిన యపుడె
పదగొన్న మోహముల్ శిధిలమవును।
గురుదేవ నీనామ మెత్తి తలచినయపుడె
పైగొన్న భూతముల్ పారిపోవు।
గురుదేవ నీనామ మెత్తి తలచిన యపుడె
భీతిలి దూతలు యరశిపోవు।

గురుదేవ నీనామ మెత్తితలచిన యపుడె।
తల్లడించెటి ప్రాణి తాపమడుచు।
గురుదేవ నీనామ మెత్తి తలచిన యపుడె।
యమధర్మరాజుకు మెరుకపడును।
ఇట్లు వివరించి మిము దలచి వినుతిశాయ।
భూతప్రేత పిశాచి పీడలు వురకనాయె॥

క॥ నిగానక చేసిన కర్మముల్ దరికొని కాలనాయె।
వాక్కుమతితోన వదలక తలువనాయె।
యెపుడు మిముదలచి యామరక తలువనాయె।
పుట్టుగిట్టుట జననంబు లేకపోయె।
గుట్టుదెలిసిన బ్రహ్మంబు తానె యాయె॥

సీ॥ విఘ్నేశ నినుదలతు వేదికార్యంబున
కార్యకార్యంబులా గలసియుండు।
విఘ్నేశ నీపాదయుగళములు శిరమున
ప్రవహించి ఆత్మలో వదలకుండు।
విఘ్నేశ మీపాద దాశినై కవితంబు
చెప్పదొణగితి వాక్కు వొప్పియుండు।

కార్యకార్యంబుల శూభాదిశుభములు
తలచిన తలుపులో తగిలియుండు ॥
యుండు మీరీతి నయముతో నాలుకందు ।
చేర్చికూర్చుము కవితంబు జెప్పినట్లు ।
నిండియుండుము ఆనందభరితముగను ।
పండియుండుము పలుకులో ప్రభలముగను ॥

క॥ విఘ్నేశ్వర నీవుగాక విద్యలకెల్లన్ ।
విఘ్నేశ్వర నీవె కవితాచరితముకెల్లన్ ।
విఘ్నేశ్వర నీవె వాకుర జిహ్వాన దుదగా ।
విఘ్నేశ్వర పలుకు నీవె పలుకులకెల్లన్ ॥

దరువు - కళ్యాణి - అటతాళము.

భజరే గణనాథం - భజరే భజాభజరే గణనాథం - భజరేగణ నాథం- పావనగాత్రం - పాలాక్షుపూత్రం పరమపవిత్రం॥ భజ॥ విద్యల సారం విఘ్నశుభారం - ముత్యాలహారం మానవులాధం॥ భజ॥ గణపతి స్తోత్రం పలుకు చరిత్రం - మనసులోమాత్రం - తలతుపావిత్రం॥ భజ॥ గంగాయపల్లెన్ - నిలుచుగణోధం - విఘ్నేశుదలతున్ కవితముజేతూన్॥ భజరేగణనాథం ॥

క॥ వినుడి బుధలార నే జేయు విన్నపంబు ప్రేమతో బ్రహ్మక్షత్రియ వైశ్య శూద్రు లాదిగావినుడి । సర్వజనుల్ ॥ పండితుల్ సంప్రీతిగాను దేశికస్వామి కృపచేత యే జేయు కృతియు మతియూ ॥

సీ॥ ఈశ్వరా నినుదలచి వినుతిజేసెటివేళ । చేకొని వాకురన చెలగియుండు । శేవించి నీపాద సేవజేసెటివేళ । హంసపాన్పైన అలరియుండు । నిష్టతో నినువెదకి నిజముజూచెటివేళ । ముకరంటి చూపునా మొనసియుండు । నీమముతో నామమెత్తి తలచెటివేళ నిజమూర్తివై యెదటనిలచియుండు॥ వుండునుండుము యీరీతి హృదయమందు । చెండివేయుము ఖర్మముల్ జేరకుండ । పరగ మమ్మబ్రోచి పాలించు మేలిమిగను। ఘనతమీరంగ గంగాయపల్లె నిలయా ॥

సీ॥ గురుదేవకరుణచే యే జేయుకావ్యంబు నాలుగుపదముల నమరియుండు వాకుర నాశిక చక్షు కర్ణముల్ గలిగుండు। చిన్మయ నేత్రము

చెలగియుండు । శిరముయురమును మించి నాభిపదమును గలిగి । హస్తముల్ పాదముల్ నమరియుండు। అర్యులు పెద్దలు ఆనందముగవిన్న వేదాంతభరితమై వెలయుచుండు॥ బృందము నీరీతి పరిపూర్ణ పావనులకు । పండియుండును వినుచున్న జ్ఞానులకును జ్ఞానపదము । గురుని సేవించికనుచున్న సద్గుణులకెల్ల । నిర్మలాత్ములకురుషులకు నిజముగాను॥

గీ॥ తల్లి తలచితినే ప్రియముతోడ భీతిదొలంగా జేయుము । మాతాఖ్యాతిగ ముకయుచుమదిలోఁ బెరయుచున్న । సంనుతిచేగన్నన న్న । మన్నతో బ్రోవుమమ్మ తల్లి సరస్వతీ ॥

సీ॥ సూక్ష్మమూర్తియుబలుక సూక్ష్మపలుకలలోన తప్పులెక్క నుండునో చెప్పలేను । వినుతిజేసితి ఓమ్మ వివరించి ఆత్మలో సవరించి చక్కగా దిద్దవలయు । భక్తిచేపలికినా కవితావిచారంబు భావించి బాగుగా చూడవలయు । ఆర్యులసేవించి అనామ్మసాదించి । శోధించి చెప్పినా వొప్పవలయు॥ వొప్పుమెప్పుము తప్పున్న దిద్దుబుద్ధి । శరణుజేశితి భక్తితో పావనులకు । ముక్తిమార్గంబు గలుగు సుమూర్తికనుచు। ప్రేమ మీరంగ జూడుమో పెద్దలారా ॥

దరువు - ధన్యాసి - అటతాళం.

శరణుజేసితి పావానులకూ - వొందనచార్రై శరణుజేసితిపావానులకూ - భావాజ్ఞులకు॥ శర॥ జేసీతిని శారాణిఘు - చెప్పేదనుజ్ఞానాకవి - జ్ఞానాకవిచెప్పీనా కొలాకును భృత్యూనై - పూర్ణామగు పావానులపండీతుల పాదాముల - ధూళినై చాలాగానే॥ శర॥ ప్రేమాతోను పేర్మిగల పెద్దాలకు - సిద్ధూలకు సహజామగు సాధూలకు - బుద్ధిగలమాత్ములకు - వేటాక్రతోను యోగూలకు - మౌనులకు - మహాన్యులకునే॥ శర॥ చదువా లేదు శాస్త్రాములు - చూడాలేదు చూడాకున - కావ్యానుది చెప్పూటకు - యెట్లుయునను - ఘనతాగను గంగాయుపల్లెలోను - వెలసినావీశూడును - వాసిగావాకూకనను - నిలచినాచెప్పీనను కావ్యామును - వప్పూమని మెప్పూవుని - తప్పూవలిఖియుండేనను - దిద్దీనాబుద్ధేనని గొప్పాగానే॥ శరణుజేసితి పావానులకూ॥

సీ॥ ఆధారముండును ఆదిగణపతిగూడి ! స్వాధిష్టముండునూ బ్రహ్మాగూడి । మణిపూరకంబుండు హరి విష్ణుతోగూడి । అనాహతంబుండు

రుద్రుగూడి । విశుద్ధముందునూ పీశునితోగూడి । ఆజ్ఞయముందు సదాశి వునిగూడి । అష్టకమలంబుందు ఆది సూర్యుతోగూడె సహస్రారముందునూ చంద్రకళతో॥ ఇట్టి దేహంబుగానక విశ్వాసరులు। కమలపద్మంబులెక్కి దిగు చున్న హంసనుగానలేక । నిక్కి చత్తురు జగములో నిష్టపరులు । విష్ణు యీశ్వర యాబ్రహ్మాకులముగనకా ॥

అక్క చెల్లెలికి వివరించె వివరము పరమరహస్యము
మహాగోప్యము.

అక్క॥ సుగిణీ - యేమమ్మ అక్కగారు॥ మాటలు॥ అక్క॥ గురు విద్య బాగాసాధించినావా॥ చెల్లెలు॥ తెలిసినమట్టుకు సాధించినానమ్మ మహాదేవి॥ అక్క॥ బ్రహ్మవిద్యేకదా, బ్రహ్మవిద్యేనమ్మ అద్భుతాకార మైన సైయ్యమయోగము॥ అక్క॥ సుగిణి - సైయ్యమయోగమంటివి - మాకుసంతోషమాయెను. అట్లయితే యోగముచూడవొచ్చునమ్మ - సుగి ణీ॥ అక్క॥ చెల్లెలికి జ్ఞానమార్గము జెప్పుట॥

వచనం॥ మార్వ.

ఏకతాళం.

సాధించి గురూకరుణ శోధించవమ్మా- అదిశోధించవమ్మా- సద్గు రు చరణమొంది సంది దెలియావమ్మా॥ సాధిం॥౧॥ ఆదిలోనాదివై భేదా మిడువావమ్మా - ఆభేదామిడువవమ్మా - నాదూలోనాదమిన్న నాణ్య మవునేకొమ్మా॥ సాధిం॥ ౨॥ గురువూకు శిషివైతె గురుతూ తెలియువ మ్మా - అది గురుతు తెలియువమ్మా - గురుతూ తెలిసిన మంచి అర్థాము వునే కొమ్మా॥ సాధిం॥ ౩॥ నాదూలో బిందుకలిసె నాణ్యమెరుగవమ్మా- అది నాణ్యమెరుగవమ్మా - బిందూలోనాదూకలసె సంధిదెలియువమ్మా॥ సాధిం॥ ౪॥ నిద్రాలో నిద్రాదెలసి నిష్టానుండావమ్మా - గురునిష్టానుం డావమ్మా - నిష్టానుండీన వెనుక కష్టామెట్టిదమ్మా॥ సాధిం॥ ౫॥ ఆత్మా లో అక్షరభావామరసిచూడవమ్మా - మదితరచిచూడవమ్మా - తరచిచూ చీన ఆయువతికామవునేకొమ్మా॥ సాధిం॥ ౬॥ పట్టూకగూరుభక్తి చూ టిదప్పకమ్మా - అదిసూటిదప్పకమ్మా - యేటిమిదారునెలలు వెతకిచూ డవమ్మా॥ సాధిం॥ ౭॥ మతిలోనగూరుమంత్రం మరువాకుండవమ్మా- అది మరువాకుండావమ్మా - మరువాకుండీన మనసుమాయానంటాదమ్మా సాధిం॥ ౮॥ బాధాలేనట్టి గూరూబోధా నొందవమ్మా - గురుబోధా

నొందావమ్మా - మద్గూరు కరుణవడచి మరుగు దెలియవమ్మా॥సాధిం॥౯॥
మూలేను వకటిజేసె మూలామెరుగవమ్మా - ఆమూలామెరుగవమ్మా -
మూఘాతానువువిడచి ముక్తినొందెకోమ్మా॥ సాధిం॥ ౧౦॥ మూడైన
దేహమూలో మునగాబోవాకమ్మా - నీవు మునగాబోవాకమ్మా - పా
టించి గూరుభక్తి మేటినుండెకోమ్మా॥ సాధిం॥ ౧౧॥ చల్లానిగూరుభక్తి
కొల్లలాడవమ్మా - అది కొల్లలాడవమ్మా - కొల్లాలాడిన ఆత్మ మళ్ళీపు
ట్టాదమ్మా॥ సాధిం॥ ౧౨॥ వివరించి ఆత్మలోన సవరించవమ్మ - అది సవ
రించవమ్మా - సవరించినట్టి ఆత్మ సమయాబోదెకోమ్మా॥ సాధిం॥ ౧౩॥
తోయాగరాని వాకిలితోసిచూడవమ్మా - అది తోసిచూడవమ్మా - తోసి
తాలుపుతీసితోలితాపుల్లైకోమ్మా॥సాధిం॥ ౧౪॥ కుంచారదన పొందుగోరి
అందీయుండవమ్మా - అది అందీయుండావమ్మా - అందీపొందీన ఆత్మా
నందామవునెకోమ్మా॥ సాధిం॥ ౧౫॥ చేకోనీనామాట చలనామిడువా
వమ్మా - నీవు చలనామిడువావమ్మా - చలనామిడిచిన ఆత్మ అచలామ
వునెకోమ్మా॥ సాధించి గూరూకరుణ శోధించవమ్మా॥ ౧౬॥

అక్క॥ జ్ఞానస్వరూపిణీ సుగిణీ గురువు నీచెవినాటజేసినబ్రహ్మో
పదేశం అద్భుతాకారమంటివి అది యేమొ చెప్పవమ్మా.

సుగిణీ చెల్లెలు॥ చిత్తం అట్లాగె చెప్పెదనమ్మా అక్కగారూ॥
బృత్యురాలై అక్కకు నమస్కరించి చెప్పదొడగె.

ద్విపద॥ శ్రీగురుమహత్త్వంబు శివగురుదీక్ష - విశదంబుగా నీతో
విన్నవించెదను - అక్కరో వినవమ్మ అరమరలేక - మద్గురుస్వామైన యా
మహామహుడు - సుబ్బగురుస్వామి యీసూక్ష్మమూర్తికిని - కారణము
దయశాయ కరుణతోబూని - నామీద దయవుంచి ననుగన్నతండ్రి - కార
ణకటాక్షంబు క్రమముతో నపుడు - వేదుకశాయను యత్నంబుజేసి -
మూణాళ్ళదీక్షయు ముదముతోబెట్టి - త్రివిధదీక్షయుబెట్టి త్రివిధవాస్తువు
లు -త్రికాలములసంధ్య త్రివిధప్రసాద గురుతీర్థప్రసాదంబు సంజీవిలోకి -
యిచ్చి సద్గురుస్వామి- దక్షిణకర్ణ - మందు యుపదేసించి ప్రణవమంత్రం
బు - బ్రహ్మోపదేశంబు బాగుగాదెల్పి - యేకాక్షరముదెల్పె వేడ్క
మీరంగ - పంచాక్షరంబును పంచకర్తలను - పంచాకాశమును - పంచ
శక్తులను - పంచముద్రల పట్టు విధువులన్నియును - యేకాక్షరంబున వె
రుకయుపరచి - దేహగుణంబుల రహితంబుజేసి పరిపూర్ణ భావంబు

బాగుగా దెలిపి - యోగభావంబును వేడుక జేసి - అస్థిరమున నటుదొ్రచి స్థిరమును దెలిపి - నిశ్చయవాస్తువ నిజముగాజూపి- శుభముగానన్ను స్థిరచిత్తుజేసే॥

వచనం॥ ఈప్రకారంబున జ్ఞానోపదేశంబు జేసివివరిస్తుయున్నాడు. ఏమనగా, ఓ శ్రీరత్నమా మొదట నీచెవినాటజేసిన ప్రణవమంత్రమె మూల మంత్రంబు ఆప్రణవమంత్రంబె స్థూలమంత్రంబు ఆప్రణవమంత్రంబె సూక్ష్మ మంత్రంబు ఆప్రణవమంత్రంబె అయిక్యమంత్రంబు ఆప్రణవమంత్రంబె ప్రసాదమంత్రంబు ఆప్రణవమంత్రంబె నుతిమూలమంత్రంబు ఆప్రణవమంత్రంబె గురుప్రసాద మంత్రంబు ఆప్రణవమంత్రంబె ద్వాదశమంత్రంబు ఆప్రణవమంత్రంబె ప్రణవద్వాదశి మంత్రంబు ఆప్రణవమంత్రంబె షోడశ మంత్రంబు ఆప్రణవమంత్రంబులో సోహంవునుమని ఆత్మఅయిక్య సంధానికరణి యిరువదివకటి వెయ్యార్నూరువాస్తువ రాత్రింబగటి జపించుచున్నదిగావున, అట్టి జపియించుచున్న అయిక్యమంత్రాని కనిపెట్టి ప్రణవ మంత్రంబు మొదలైన పంచాక్షరి మంత్రమె పరమమంత్రంబు అట్టిపరమ మంత్రంబు నీవు ఎరన జేయుచూ మొదటచెప్పిన పట్టుచేత రేచించి పూరించి పవనునిలేపి ఆధార స్వాధిష్టమణి పూరక అనాహత విశుద్ధ ఆజ్ఞెయ సహస్రారముపై జేరి ఆయర్ధనారీశుండైన సద్గురుస్వామిని దరిశించి అంద్రైక్యమై నీవు జోతసిరామయస్వరూపంబై వెలుగుచూ, ఇట్లుండవే శ్రీరత్నమాయని సద్గురుస్వామి వాచాగోచరించెను. నీకు తెలియనిది యేమున్నదమ్మా॥ అక్కగారు॥ యింతవట్టుకుచెప్పి సెలవిచ్చినాడమ్మా మహాదేవీ॥ అక్క॥ యెంతపుణ్యాత్మురాలవమ్మా - చెల్లెలా। గురుయుపదేశములేని మానవులకు మోక్షములేదని నిశ్చయముచేసినారు పెద్దలు యేమనగా, జ్ఞానము తెలియక అజ్ఞానమువృత్తిచేత మదోన్మత్తులై తారతమ్యము తెలియక జీవహింసచేసి నరకప్రాప్తులౌదురని వారికి మోక్షములేదని పెద్దలు నిశ్చయించినారు. నీపూర్వకృత్యము మంచిది యోగము చూడవమ్మా॥ సుగిణీ॥ చెల్లెలు॥ నాయోగము సాంగోపాయము అయ్యేవరకు నాకు తెలియచేస్తూ నావెంటనె యుండవమ్మ మహాదేవీ అని నమస్కరించెను॥ అక్క॥ సుగిణీ నీయోగము సయ్యమయోగము, నీభావము స్వానుభావమని చెప్పితివిగదా॥ చెల్లెలు॥ అవునమ్మస్వానుభావ సయ్యమేను మహాదేవీ॥ అక్క॥ అట్టిసైయ్యమయోగం నీవుచూచేటప్పుడు స్థానాస్థానముల

యందు నీకు తెలియని సందేహముండును. అప్పుడు యిదియేమొ అక్క-గారు, నాకు తెలియజేయుమని అడిగెదవు. అపుడు జెప్పిన క్రియాసూత్రములు గ్రహించుకొని మాయందు అనేక విశ్వాసముచేత మహాభక్తితో మాయాజ్ఞమీరక చెప్పిన క్రియాసూత్రములు గ్రహించుకొని యోగము చూచెదవ - సుగిణీ॥ చెల్లెలు॥ చి॥ అట్లాగె మీరు సెలవిచ్చిన ఆజ్ఞప్రకారం చూచెదనమ్మ మహాదేవి గురువేమి నీవేమి మీయిద్దరిసందు భేదమున్నదె॥ అక్క॥ అట్లయితె నీయోగము సాంగోపాంగము అయ్యేవరకు నాకు తెలిసినమట్టుకు నీకు తెలియచేస్తూ నీవెంటనె వుంటూ లెమ్మని- అక్క- చెల్లెలికి అభయమిచ్చి యోగముచూడమనెను. అనిన అక్కకు నమస్కరించి చెల్లెలు యోగముచేరెను.

శుభమస్తు.

శ్రీశారదాంబాయనమః.

యక్షగానము కథాప్రారంభము.

త్రిపుట.

చెల్లెలు॥ అక్కరో యీచిత్రమేమో మాకుక్కతో గురుణిమంత్రము మరువకను నేతరచబోతె మరువుదగులు కె॥ ౧॥ చెలియరో వినవమ్మ చెల్లెల చలనమొందక గురుణిమంత్రిము - అన్న ఆత్మలో యున్నచోటు నాకన్నసుఖమే॥ ౨॥ అక్కరో నీవంటివె నాకాత్మలోపల చలనమున్నదే - మాయదేమో నొచ్చి మరుపూ జేసెగాక కె॥ ౩॥ చెలియరో నీ చక్కదనముకు చలనమొందక పోవునటవే - కలికిరో నీచిలుక పలుకులూ కట్టిపెట్టూ॥ ౪॥ అక్కరో నేమాతృగార్భముసందు బుట్టిన ఫలమేయేమో - కాని లేలేవమ్మ యెంటివి కరుణలేక కె॥ ౫॥ చెలియరో వినవమ్మ మాతౄగార్భమందున బుట్టినప్పుడే - మాయబుట్టె మరుగునుండునే మమతతోనూ॥ ౬॥ అక్కరో యీమాయ యెంతటిదనకయున్నదో - వెరుకపరుచుము - సరుకుశాయక చాప్పవమ్మా సవుజ్ఞమేమో॥ ౭॥ చెలియరో వినవమ్మ చెల్లెల పిపీలికాదీ బ్రహ్మాదనుకా - మాయ యున్నదె యాది కనినేచెప్పెదమ్మా॥ ౮॥ అక్కరో అదియాడికున్నదో జోడుబాసే విధము దెలుపుమూ - గుప్పునను దెలుపమ్మ యీప్పుడూ దక్కనట్లూ॥ ౯॥ చెలియమరుగూ దెలిపినాట్టీ గురుణి మరువక యుంటివే నీ - జంటయున్నా మాయవిడచీ జరిగిపోనే॥ ౧౦॥ శరణుజేసితి నమ్మ అక్కరో మరు

గుదెలిపిన గురుణి చరణమూ - మరువకను నాహృదినయేప్పుడూ - మరువ
కుందూ॥ ౧౧॥ చెప్పెదను వినవమ్మ చెలెల వోప్పి ఆత్మలోవదలుమాయ
ను - బుద్ధిజేప్పిన నిలుపు నీవిఘూహద్దులోనూ॥ ౧౨॥ అక్కరో ఆమాయ
వదలె మరుగుదెలుపుము నీవు తిన్నగ - తన్నియీడ్తును తరణమందునా
తగలకుందూ॥ ౧౩॥ చెల్లెలా విను గురుణిమంత్రము- గురువుగూట్టని గురు
ణి ఆజ్ఞతో - తరచినాప్పుడె మరుపుజేసే మాయవిడుచూక॥ ౧౪॥ అక్కా-
రో నేగురుణిమంత్రము తరచినాప్పుడె తరణమందునా - తళుకువురుమూ
మెరుపులేమో తగగదెలుపూ॥ ౧౫॥ తెలిపేదను వినవమ్మ చెల్లెల తెలివి
గలిగిన తేటపడునదీ - బోటిరో నీపుణ్యమేమేబాటిదారికేక॥ ౧౬॥ అక్కా-
రో నేనాదిజూడగ శోధజేశి సొంపుమీరగా - ఆదిజూడగ అలరుచున్నా
డతనుయెవరూ॥ ౧౭॥

## ఆధార కమలము.

తోహారా॥ అప్పుడు చెలియా అక్కతో బలికెను - అతిసిప్టాతో
నూ - అక్కరో యీస్తానము యెయ్యేదో తెలుపు కరుణతోనూ॥ శ్రీగు
రుదేవాయనుచూ శ్రితజనరక్షకుగనుచూ॥ యీస్తానమందునాయున్న మహా
త్ముడు యీప్రభు యెవ్వారో - తొండమున్నదీ యేకదంతమూ యిదియే
మక్కరో॥ శ్రీగురు॥ కురుచహస్తములు పాదంబులు మరి - గుజ్జురూప
మమ్మా - వెళుపుకర్ణములు చిన్న నేత్రములు మెల్లచూపుకొమ్మా॥ శ్రీ॥
చెల్లెలు॥ అక్కా - యీస్తానమందున - ఆదిమంత్రం - తరుచుచూ - దృ
ష్టినిలిపిచూడగా - అక్కడ కానబడెవాస్తువ - కురచహస్త పాదముల
తో - కింనెరబోజకిరీటముతో - గాయిత్రిగంధాక్షంతలతో - తొండము
యేకదంతముతో - పెదవులు లావుగల - గొప్పనోటితో - చిన్న నేత్రము
లు - వెళుపుకర్ణములతో - విస్తారముగలఫాలము - అర్ధచెంద్రాకార -
కాంతిగలదేహముతో - బిసాంబ్రముగా - అధోముఖుండై - నాలుగుదళ
ములుగల పద్మమందున - పద్మాసనాశీనుండై - వసియించియున్న యీ
మహాత్ముడెవరు - యితని చరితమేమి - వీరినామధేయంబేమొ - విశద
ముగా తెలుపమని విన్నవింతును॥ అక్క॥

తోహారా॥ శ్రీగురుదేవాయనవే - శ్రితజనరక్షకుగనవే॥ చెలియ
రో విను యీస్తానము శంకర గణపతుండెచోటూ - సద్గురుకరుణచే అన
వరతంబును - ఆచరించిచూడూ॥ శ్రీ॥ ఆధారానికి అధిపతి యితడె ఆది

గణపతేమ్మా॥ శోధన జేశీచూచేవారికి పవనమూర్తైకొమ్మా॥ శ్రీ॥ అంద వికారము గుజ్జురూపమని అనుకోవోదమ్మా అందరిలోనూ అనుకూలంబై ఆడుచుండుకొమ్మా॥ శ్రీ॥ అక్క॥ జ్ఞానస్వరూపిణీ - సుగిణీ - అతడే యజ్ఞకర్త అతడేనమ్మ ఆదిగణపతి॥ ఇద ఆధారస్థానం. భూలోకమమ్మా - చూడగలిగితివి - పుణ్యాత్మురాలవే నమ్మ - చెలియా - సంతోషించుము॥ అట్లాగె సంతోషించెదనమ్మ - అక్కగారు॥ అక్క॥ ఆధారకమల నిర్ణయము వివరిస్తుయున్నాము.

త్రిపుటం.

చెలియరో ఆధారమందున- ఆదిగణపతికన్నతండ్రీ- అతడేనమ్మా పరమపురుషుడూ - అతడేనతడే॥ ౧౮॥ అక్కరో ఆధారమందున ఆది గణపతికన్న తండ్రిని - చెప్పితివి యీపరమపురుషునీ - చరితమేమీ॥ ౧౯॥ చెలియరో ఆధారమందున - చతురురేకుల కమలముండును - అర్ధచంద్రాకార కాంతితో నమరీయుండు॥ ౨౦॥ అక్కరో అది అమరియుండెటె అంతుదెలుపుము ఆలసించకా - యింతయేమో చాప్పవమ్మా యిందుకందూ॥ ౨౧॥ చెలియరో ఆకమలమందున చెలగుచుండెన రేకులందున - వ-శ-ష-స-లని నాల్గురేకుల బీజలుండునూ నాదముండూ॥ ౨౨॥ అక్కరో ఆ బీజలేమో నాదమేమో నాకుదెలుపుమూ - పాదమూలము వడిగెగుప్యామూ వొత్తిచూతూ॥ ౨౩॥ యెంతదానావమ్మ చెల్లెల అంతమార్గము గురువుచేతను తెలుసుకొనినన్నదుగదగునే తేటగానూ॥ ౨౪॥ అక్కరో ఆగురుణికలసిన మరుగుదెలసిన మంత్రమరచిన- మాయవిడుచునె నీవులేకనూనేనుజూడా॥ ౨౫॥ నన్నునమ్మిన చెలియవైతే నేనుజెప్పిన బుద్ధిగైకొనీ - మనములోపల యుంటివేనీ - మర్మమిడుదూకె॥ ౨౬॥ అక్కమాటలు ఆలకించీ శరణుజేశీ వినయుంచీ - మంచిదాట్లనె చాప్పవమ్మ నీచరణమందేకె॥ ౨౭॥ చరణమొందిన చెలియ శిరమున - హస్తములు తామరబెట్టి - చరణమొందిన మరణమేడీదీ చెలియలెమ్మూ॥ ౨౮॥ అక్కపాదము బాట్టినాట్టీ చెల్లెలంతటి లేచినిలబడీ- శరణుజేశీ పాదదాశీ ననుచుబలికెకె॥ ౨౯॥ అనుచు బలికిన చెలియ నిటురారమ్మనీ తానభయమిచ్చి - చెలియరో నీసాటి యవరనీ చెప్పదొణగెకె॥ ౩౦॥ అక్క నినునాడడిగినాట్టీ నాదమేమో బీజమేమో - నాడుఅడిగిన మార్గమంతయూ నేడుదెలుపూ॥ ౩౧॥ తెలిపెదను వినవమ్మ చెల్లెల తేటతెలివిగవినుము యీాపు

డూ - పరశవేధిసోకినా బంగారురీతీ॥ ౩౨॥ అంతెచాలూనమ్మ అకటారో పంచలోహమైన దేహమూ - పరశవేదీసోకి నటుగాపరిణమించూ॥ ౩౩॥ చెలియ విను తెలిపెదను యీపుడు బీజములె జీవాత్మరంబులు - నాదముండును నాశికాగ్రము దపకనీకీరా॥ ౩౪॥ మనవిజేసితినమ్మ మంచిది నాశికాగ్రముదనక నాదమూ యెటులయున్నదో యెరుకపరుచుమూ వేటరా మీరక॥ ౩౫॥ తెలిపెదను వినవమ్మ చెల్లెల జీవహంసై ఆడుచుండునూ - పరమహంసై తలుకు నాదమూకులుకుచుండూ॥ ౩౬॥ అకటా హంసల జాడజూడా జోడుగూడాబోతె యీపుడూ - శక్తియే మోయున్నదమ్మా చెల్వముగనూ॥ ౩౭॥

తోహరా॥ శ్రీగురుజేవాయనుచూ-శ్రితజనరక్షకుగనుచూ॥ అకాటా మ్రొకెరాద ఆమె యెవ్వరో అంతుదెలుపునాకూ - సాష్టాంగంబుగ సాగిలిమ్రొకెరాద చాలగాను నీకూ॥ శ్రీ॥ నాల్గురేకులా పద్మమందునా నమరియున్నదెమ్మా - రత్నగద్దెపై కూర్చున్నాదొక రాజీవాక్షమ్మా॥ శ్రీ॥ ఆభరణాలా సొమ్ములతోనా నమరియున్నదెమ్మా - చూచినచాలీ సుంధరాంగినీ శుభముగల్గుకోమ్మా॥ శ్రీ॥ చెల్లెలి॥ అకాటా - యీఆధారస్తానమందున - దృకురాసలిపీచూడగ - అకటాడకానబడెవొస్తువ - చెంగల్వచీర - పట్టుకంచకముతో - పౌజీగజ్జలు మెరుగుమెట్టెలతో - ముత్యాలహారములు - ఆభరణములతో - హస్తకంకణ - పశిడిగాజులతో నడుమవడ్యాణము - జడబిళ్ళలతో - వజ్రాలకమ్మలు - ముత్యాలబుగడలతో - పకటాబావిలీలు-కుందనపునత్తుతో-జారుపైయద- కులుకుగుబ్బలతో- యింద్రనీలకెంపు పచ్చలు జెక్కిన- కుందనపు కిరీటముతో- అర్ధచంద్రకాంతిగల దేహముతో నాలుగుదళములుగల పద్మమందున- రత్నగద్దెపై వసియించియున్న- యీకిరీటియెవరు- యీమెచరితమేమి- యీమెనామధేయంబేమి - విశదముగా తెలియజేయుమని - ప్రార్థించెద॥ అకటా॥

తోహరా॥ శ్రీగురుదేవాయనవే- శ్రితజనరక్షకుగనవే- హద్దునసిలవే ముద్దులచెలియా అంతుదెలిపేదానూ-అదియేనమ్మా ఆధారంబున సకలక్రియకుశక్తీ॥ శ్రీ॥ క్రియాసూత్రమూకీలక ముందేదీమెవద్దనేనూ- చాలగ సద్గురుభక్తులకిచ్చేమూలికెలవియేనూ॥ శ్రీ॥ సూర్యకాంతయును - చంద్రకాంతయును- బ్రహ్మకాంతయనగా-మూడుకాంతలామూలమెరిగితే ముక్తెనందుదు ముఖ్యముగా॥ శ్రీ॥ గు॥ అకటా॥ జ్ఞానస్వరూపిణీ- సుగిణీ- ఆమెక్రి

యాశక్తి-నాదనామక్రియకు ఆమెకర్త-ఆరునూరుహంసలు-గణపతికి- అర్ప ణ॥యీశక్తిలోనెపుట్టి- అచటనెఅణుగు- యీపరమపుణ్యునికి- పూజజేసు కోవమ్మ- సుగిణీ॥ చెల్లెలు॥ చిత్తం॥ యేమిపూలపూజచేయువలెనో చెప్ప వమ్మా- మహాదేవి- ఆయనకు యేమిపూలైన సరేనమ్మా- సుగిణీ॥ అక్కా- డ-గణపతికి- ఆరునూరుజపపూజ అర్పణఅవుతూయున్నది॥

త్రిపుట.

చెలియ క్రీయాశక్తి నదియే సకలక్రియలూ చాకిరి-బెట్టునూ- ఆరు నూరూహంసలైనదీ ఆడుచుండూ॥ ౩౮॥ అక్క యిన్నీగలిగినాట్టీ కమల మందున జూడబోతే - యెరుపువర్ణము మెరుపుమించినా దీపమేమీ॥ ౩౯॥ చెలియరో విను ప్రేమమీరగ పమలమైనాథునుడు గణపతీ-నాధనామ క్రియ లు సలుపుచూ నమరియుండూ॥౪౦॥ అక్కరో ఆధారకమలము నందుయుం డిన చరితజూచితీ- అందుపైగా అలరుచున్నాడతెను యెవరూ॥ ౪౧॥

ప్రధమభాగం - సమాప్తము.

---

రెండవభాగము.

జంపె.

చెల్లెలు॥ అక్కరో యీఅగణితంబైనస్తానంబు - యేమేదో తెలు పమ్మ వేఱు-మీరంగా॥నీవుదెలుపుము తల్లి నేనువిందునుచా-యిమ్మేలు మరు వనేనెపేలుకై నా॥ చెల్లెలు॥ అక్కా-యీస్తానమందున- కౌపీనకటియూ త్రిముతో-గాయిత్రిగంధాక్షింతలతో- విభూదిరుద్రాక్షహారములతో- కర్ణ పత్రత్రిపుండ్రములతో - అరుణఛాయగలదెహముతో - నవరత్నఖచితమైన కిరీటముతో-తత్పురుషముఖ-సమదృష్టితో-చేతజపమాలబట్టి- ఆరుదళములు గల పద్మమందున- మయూరాసనశీనుండై- వసియించియున్న- యీమహా త్ముడెవరు- యితని చరితమేమి- వీరినామధేయంబేమొ-విశధముగా ప్రసా ధింపుమని-విన్నవింతును॥

జంపె

చెలియరో వినవమ్మనీకు జెప్పగనేమి- అగణితంబైన యీమహాస్త ళము మహాత్యం॥ సావధానముగాను సఖియరో వినవమ్మ- నిర్మలాచిత్త మున నిలచినీవిపుడూ॥ అక్క॥ జ్ఞానస్వరూపిణీ-సుగిణీ-అగణితంబైన- యీ మహాస్తానమందున-యున్న చరితము- తెలియజేతుము-విను॥చెల్లెలు॥ అక్కా-

నాకిప్పుడొక సందేహముగాయున్నది - అదియేమొ తెలియజాయవమ్మా - మహాదేవీ॥ అక్క॥

వచనతత్వము.

శంకరాభరణం - ఆది.

ఏమేచెలి మనసూహంసాయనంటివే-పరహంసాయనంటివే- యిషణీసంసేయంబులుమానీ సర్వాముగనవే॥ యేమే॥ ౧॥ గురువూనుగనవే - గురుతూగనిలవే-సేవాకినినిమాదీచలనాముపిడవే॥ యేమే॥ ౨॥ గుట్టూనసిలవే-పటూవగలవే - నొట్టిత్రిభ్రామలువీడీ- వరగురుణిగనవే॥యేమే॥ ౩॥ నానా ముపినవే-భేదాముపిడవే-వాదాములునుమానీ సాధూలగనవే॥ యేమే॥ ౪॥ గుహ్యముయువే-కయ్యామమనవే- కుయ్యుకుండిఠూసేపర్ణవామపినవే॥ యేమే॥ ౫॥ వినవేచెలియా-కనవెచెలియా - యేకాక్షరమునూదీనెన్నాతె చెలియా॥ యేమే॥ ౬॥ చిన్నేలువిడవే- కిన్నెరమీటవే-ఆదీనిగని హంసావాకీలిదీయవే॥ యేమే॥ ౭॥ గురుమంత్రామనవే-ఓంకారమినవే-వన్నెమీరిన నాగాక-న్నెనుగనవే॥ యేమే॥ ౮॥ మూలెనువిడవే- మూలామునగనవే- ముదియూచుయామ క్తి కాంతానుగనవే॥ యేమే॥ ౯॥ సూక్ష్మమూర్తినవే - సుఖనాదమినవే-సుబ్బాగూరూణిసూధరీశానగనవే॥ యేమేచెలిమనసూ॥

చెల్లెలు॥ అక్కా- మీరు వివరించిన మహావాఖ్యములు విని నామనసునయున్న సందేహము వీడిపోయెను. నాచిన్నవిన్నపమొకటి ఆలించుము. మహాదేవీ.

వచనతత్వము - కాంబోది - ఆది.

గురువును మరలేదే-అమ్మనేగురుతూవిడలేదే-స్వామినిమీరలేనేతల్లినే- నీమమువిడలేదే-నీమమువిడలేహూ ధామునిసాక్షిగా - కామమోహములు కలుగజాయలేదూ॥ గురువును॥ ౧॥ కాంతాపురుషులలోకలిగినా - భ్రాంతీమనసూలో-భ్రాంతిమనములో విశ్రాంతినిబొందీ - మందమైన యూమాయనంటకనూ॥ గురు॥ ౨॥ సారెకుసారేకూనాపై నేరములెంచాకూ - సారెకునాపై నేరములెంచితే-భారముమ్రోయలేను బంగరుతల్లినే॥గురు॥ ౩॥ నన్నూమరచీనా- తెలివిగానిన్నూజూచీనా-నిన్నుజూచినా సన్నుతాంగిరో- గురువనెగురుతునా యిమవకమదిలో॥గురు॥ ౪॥ భక్తినెయింతీనీ- నేనివూముక్తినె అక్కా-వూ-ముక్తేనె అక్క-తోముచ్చటలాడుచూ- హెచ్చిన భక్తితో వెలశీకలశీ॥ గురు॥ ౫॥ అప్పామపల్లేనావెలసినా- సుబ్బాగురు

డూనా-సుబ్బగురుడునాకేకాక్షరమది-నాటనజేశనుఘరన జేయుమనీ॥ గురు॥ ౮౧॥ అక్షరమదితోడా యోగాజివ్హానునిలిపాడా-జివ్హానునిలిపాడా- సూక్ష్మమూర్తిలో-ఘుంమని మ్రోయుచూ గుమ్మనుగంటిని॥గురువును మరలేదే॥

చెల్లెలు॥ అక్కా- నాగురువుకటాక్షము యిచ్చినదిమొదలుకొని - గురువుయిచ్చినవాస్తువ-నాటునస్సుయెందు- మరువలేదమ్మా-అక్కగారు - బ్రహ్మాచరితముయెట్టిదో-తెలుపవమ్మా- మహాదేవీ॥

అక్క॥ మంచిది తెలిపెదవిను॥

త్రిపుట.

చెలియరోస్వాధిష్టమదియే లింగస్థానము బ్రహ్మా అధిపతీ- అతడే నమ్మా సృష్టికార్తాఅతడైనతడే॥ ౮౨॥ అక్కరో స్వాధిష్టమంటివిలింగస్తానము-బ్రహ్మాయెంటివి- సృష్టికార్తాఅతడెనంటివి అనగయేమీ॥౮౩॥ ప్రేమతో వినవమ్మచెల్లెల- సృష్టిజేసిన బ్రహ్మాచరితము- స్వష్టముగ నేదెలిపెదను వినూ - యిష్టముగనూ॥ ౮౪॥ అక్క తెలుపుము బ్రహ్మాచరితము తేట తెలివిగ యింపుత్వరితముగా-తెలుపవమ్మా బ్రహ్మాచరితమూ - తెలుపు తెలుపూ॥ ౮౫॥ అక్క॥ మంచిదట్లగే-వివరిస్తుయున్నామమ్మా-సుగణీ॥

స్వాధిష్టకమల నిర్ణయము వివరిస్తూయున్నాము.

త్రిపుట.

చెలియరో స్వాధీష్టమనియేటికమలమందున ఆరుదళములూ- త్రివిధ విధమనే కోణమైనదీ - అమరియుండూ॥ ౮౬॥ అక్కరో ఆకోణమేమో అమరియుండే వింతయేమో - అంతుజెప్పుము అలసిచక్క-అడిగినపుడే॥ ౮౭॥ చెలియరో స్వాధీష్టమందున ఆరుదళముల కమలముందునూ- బభమ-యరలనియెడ-బీజలుండును వినగవీణారవవముండూ॥౮౮॥ అక్కరో అది వీణరవమని చెప్పితివి యీతెరగుయేమో - తెలియపరుచుము తేటతెలివిగా మరుగుయేమో॥ ౮౯॥ చెలియరో నాముద్దుగుమ్మా యెంతచాక్కనిదానవమ్మా పరమపురుషులపాట్టివమ్మా యిజునికోమ్మా॥ ౯౦॥ అక్కరో నేనెంతదానను యింతదూరమువర్ణించనేటికీ - సంగీతబిడగొట్టియున్నా సవిజ్ఞదెలుపూ॥ ౯౧॥ మెచ్చితినెనాముద్దుచెల్లెల యీచ్చితినె నీకున్న వివరమూ-హెచ్చితివెవేవేగ తెలివియోగగుమ్మా॥ ౯౨॥ అక్కరోనే నిన్నిగలిగిన కమలమందునచూడబోతే శక్తియేమోయున్నదమ్మా భక్తితోనూ॥ ౯౩॥



బ్రంహ్మజ్ఞానశక్తి

జంపె.

అక్కరో యీస్థానమిదియేదో తెలుపవమ్మా - చూడసుందరమైయి తోచుచున్నాదీ॥ యీసుందరీ రత్నమీ పగడపుసాన - ముత్యాల సరణి యీముదిత యవరమ్మా॥ చెల్లెలు॥ అకా॥ యీస్వాధిష్టకమలమందున - నడమవధ్యాణం - నయమైనచీరతో - కలువపూవులకంచుకము- కాళ్ళగజ్జలతో- మెళ్ళమెట్టెలు- నిమ్మగుత్తులతో- పచ్చలకడియాలు-పసిడిగాజులతో బాజీబందు- బంగారుసందిబాండలతో-కంఠసరాలు- జంటసొమ్ములతో - కుచ్చులగంటీలు- బుగడబావిరీలతో- నాశికమున- పచ్చలుజెకేన నత్తుతో- నవరత్నకుప్పె-సన్నజాజులతో- కిరీటధారియై-యత్రటిఛాయగల దేహముతో- ఆరుదళములుగల పద్మమందున- పచ్చలగద్దెపై వసియించియున్న - యీకిరీటియెవరు- యీమెచరితమేమి- యీదేవినామధేయంబేమో - త్వరితముగా ప్రసాదింపుమని- విన్నవించెద॥ మంచిది॥

జంపె.

ఇది మహాసౌఖ్యంబు- యిది మహారాజ్యంబు- యిదిమర్మమిది ధర్మమిదియొఖర్మంబూ॥ ౧॥ స్వాధిష్టస్థానమిది సొంపుమీరగ చెలియ - భ్రమయయుండెచోటు నికము దెలుసుకోవమ్మా॥అక॥జ్ఞానస్వరూపిణీ॥ సుగిణీ॥ ఇది భువర్లోకం- ఆరువేలహంసలు బ్రహ్మకు అర్పణ-యీశక్తిలోనెపుట్టి- అచటనె అణుగు-యీమెనమ్మా జ్ఞానశక్తి-యీమహాదేవుడైన బ్రహ్మకు-పూజచేసుకోవమ్మా-సుగిణీ॥ చిత్రం॥ ఏమిపూలపూజజేతునమ్మా- మహాదేవీ- అతను బ్రహ్మచారిగనుక- యత్రటిపూలతో-పూజసేయవమ్మా-ఆరువేలు జపపూజబ్రహ్మకు - అర్పణఅవుతూయున్నది॥

త్రిపుట.

అదియేనమ్మా జ్ఞానశక్తి- వీణరవమ్ముపలుకుచుండగనూ .. ఆరువేలాహంసలైనది- ఆడుచుండతూ॥ ౨౪॥ మంచిదాకరో యింకవాకటి మన విజేసితి శరణుజేశీ-లింగస్థానమునందుయుండే సంగమేమీ॥ ౨౨॥ చెలియా లింగాస్థానమందున యేసుప్రజపతి శివనాదము - కలసిలోకము లెల్లనిండీ పుట్టుగిట్టూ॥ ౨౬॥ అక్కనీవే తల్లిదండ్రీ గురువునైవామనుచునమ్మితి-గాక యెవ్వరుయున్నరమ్మా నీవుగాక॥ ౨౭॥ చెలియ విననీగురుణకయంతో తెలిపిచేనన్న డగడగిఅపె-వాదియేమియున్నదమ్మా మానసతగో॥ ౨౮॥

మాలిని.

శ్రీగిరిజాత్మజ-సరిలేరునీకు-జగతిని-ప్రస్తుతచరితా-నున్ననతోడుత - కన్నానీచరితమువిన్నా - పుణ్యముగదె - యెన్నాళ్ళాతరముగాదు చిన్ని గణేశా॥

గద్యము.

ఇది శ్రీమదఖిల విద్యత్కవి జేగీయ్యమాన సరస కవితానంత విద్యావిశేషానంతంబగు, శ్రీవేదాంత కవితానందంబైన సహస్రారమహాత్మ్యములో ప్రథమ ఆశ్వాసములో యుదహరించిన ఆధారచక్రముయొక్క చతురురేకుల వర్ణయయూ గణపతివర్ణయు క్రియాశక్తి వర్ణనయూ ప్రథమ ఆశ్వాసమందును, ద్వితియాశ్వాసములో స్వాధిష్టస్థాన మహాత్మ్యమున్ను షట్దళముల చక్రమహాత్మ్యము బ్రహ్మవర్ణన క్రియాశక్తివర్ణనయు సూక్ష్మమూర్తి తపోమహాత్మ్యమువల్ల వర్ణింపబడిన జ్ఞానస్వరూపిణి ఆత్మస్వరూపిణి అను అక్క-చెల్లెలి సంవాదంబనే ప్రథమ ద్వితియ్యా ఆశ్వాసములు సంపూర్ణము.

శ్రీపరమేశ్వరార్పణమస్తు.

---

త్రిపుట.

అక్కరో స్వాధిష్టకమలమునందుయుండిన చరితదెలిసెనూ - అందుపైగా అలరుచున్నా అతనుయెవరూ॥ ౫౯॥

తోహరా॥ శ్రీగురుదేవాయనుచూ- శ్రితజనరక్షకుగనుచూ॥ అందమైన యీస్థానముయెయ్యదో-యీప్రభుయెవ్వరో - సువర్ణగోపురద్వార విచారంబది దెలుపక్కరో॥ శ్రీ॥ దాపువగోపురద్వారముగంటిని కనులపండుగానూ-వింటినినాదము ఘంటారవము చెవులనిండగానూ॥ శ్రీ॥ చెల్లెలు॥ అక్కా-యీస్థానమందున శంఖుచక్రకిరీటభుజకీర్తులతో - పట్టుపీతాంబ్రముతో- వజ్రవైడూర్య మరకత మాణిక్య కెంపు నీలముతో-ఖచితమైన హారములతో-కర్ణపత్ర ఆలవట్టధ్వజములతో-ముత్యాలగొడుగు-యింజామరలతో-నీలమేఘచ్ఛాయగల దేహముతో-దళవళములుగల పద్మమందున - శేష సింహాసనారూఢుడై- వసియించియున్న- యీమహాపురుషుడెవరు - యితనిచరితమేమి- వీరినామధేయంబేమొ- విశదముగా ప్రసాదింపుమని విన్నవించెద- యింకొక సందేహము అక్కా- మీతో చెప్పక యెవరితో

చెప్పదు- యీస్థానమందున- యోగముచూడగా - తెంపుగా తెగలేదు - యేమోచెప్పవమ్మ- మహాదేవి॥

తోహరా॥ శ్రీగురుదేవ యనవే శ్రితజనరక్షకుఁగనవె- వినవే చెలి యీస్థానమహాత్మ్య లౌకికము బహుషోకు - గోపురద్వారమి నాటకశాలలు వివరించెదనీకూ ॥ శ్రీ॥ జగతిరక్షకుడు చక్రవర్తి యితడ్విష్ణుదేవుడమ్మా - ద్వారమురమ్యము యిట్లుండును యిది సువర్లోకమమ్మా॥ శ్రీ॥

వచనతత్త్వము.

భైరవి రాగము - ఏకతాళము.

అనుభవముచేసే అమ్మగారికా-వంటలపాకమూ తెలియవలెనె-వంటపాకమూ యింటిన తెలిసితే-కంటిలోకనిమరిగుండవలెనె॥అను॥ ౧॥మూడుఆరు వాకిండ్లుమూసియూ- మూలాధారం లేపవలెనె- పవనునిలేపి పదింటచేరి ద్వారముతలుపదే తియ్యవలెనె॥ అ॥ ౨॥ మూడింటబట్టి ఆరింటగట్టి చక్రగదంచీ చండించవలెనె - మకరవతోయున్నా మమతలబట్టి తప్పన టక్కరా లణచవలెనె॥ అను॥ ౩॥ సుట్టుతిరిగే సుడిగాలినిబట్టి సుషుమ్న దీడ్డిన చేరవలెనె - కొంకరగుణములా కుండలుగోకే - మొండి ఖర్మముల చెండవలెనె॥ అను॥ ౪॥ అప్పుయుపన్నసూబ్బగురుణి కరుణతిరహస్యము నీకు తెలుసుగదా- తెలసినవోస్తువ తేటగజూచితే-అనుమానంబటూ లేదుగదా॥ అనుభముజేసే అమ్మాగారికా॥ అక్క॥ జ్ఞానస్వరూపిణీ॥ సుగిణీ॥ గురుకటాక్షముబొంది - గురుతుగాచూచేవారికి - సందేహంయేమి- అక్షరముపఠనజేసేవారికి॥ చెల్లెలు॥ చిత్తం॥ అక్కగారు॥ నాదొకమనవి. నీవు చెవు ఆలించి-వినవమ్మ-మహాదేవి॥

వచనతత్త్వము - మధ్యమావతి - ఆది.

అంటీ అంటీని అంటీనమ్మా-ఆనాదుచెవినాయింటీ యింటీని యింటీనమ్మా॥ అంటీ అంటీగురూ అక్షరమాత్మలో - యింటియింటి ఆనాదముచెవి నేనంటీ అంటీని అంటీనమ్మా॥ సుబగురుణీకరుణతో- అంటీఅంటీని అంటీనమ్మా॥ ౧॥ కంటీకంటీని కంటీనమ్మా-మూకంటీశివునీకంటీ కంటీనికంటీనమ్మా- కంటికంటి యారెంటెకునమమా - ముకంటిశివునీ మూలవిరాటునూ॥ కంటీ॥ ౨॥ మంటీమంటీనిమంటీనమ్మా-సద్గురుణీకరుణచేమంటీ మాంటీనిమంటీనమ్మా-మంటిమంటి మద్గురుకరుణతో - జంటనకోవులు అంటివూదుచూ॥ మంటీ॥ ౩॥ వుంటీవుంటీని వుంటీనమ్మా - ఆవొంటిదెలసీ

వుంటీ వుంటీనివుంటీనదమ్మా-వుంటివుంటియా వొంటిదెలుసుకోని- కంటిలో బ్రహ్మమునంటిపెనుగుచూ॥ వుంటీ॥ ౪॥ సుబ్బాగురూకరుణెచాలూనమ్మా యీసూక్ష్మమూ ర్తికీ-సుబ్బాగురూకరుణెచాలూనమ్మా- చాలుచాలు నా సద్గురుకరుణె-మేలుమేలు ఘదవేలకునైనా॥ చాలూచాలూనుచాలూనమ్మా॥ సుబ్బగురుణీకరుణే- చాలూచాలూను చాలూనమ్మా॥ చెల్లెలు॥ అక్కా॥ నాగురువైన - సుబ్బగురుస్వామిగారి- కరుణేచాలును - విష్ణుచరితమువెట్టిదో తెలుపవమ్మా - మహాదేవీ॥ అక్క॥ మంచిది - అట్లాగె తెలిపెదనమ్మా॥

త్రిపుట.

అతడెనమ్మా విష్ణుమూర్తి సృష్టిలో వెలిమాయకాడూ - అతడెనమ్మా కపటనాటకూడతడెవతడె॥ ౧౦॥ అక్క విష్ణూ అనగయేమీ - మాయకాడూ అనగయేమీ- కపటనాటకుడనగయేమీ చరితమేమీ॥ ౧౧॥

వచనము. మణిపూరక కమలనిర్ణయము వివరిస్తూయున్నాము.

త్రిపుట

చెలియరో మణిపూరకంబనె కమలమందున పదిదళంబులూ- శ్యామవార్ణము వేణునాదమూ - గలిగియుండూ॥ ౧౨॥ అక్కరో ఆశ్యామవార్ణము-వేణునాదము వెటులయున్నదో- పటుతరముగ దెలుపవమ్మా - ప్రజ్ఞయేమో॥ ౧౩॥ చెలియవిను ఆకమలమందున- దశదళంబులు ధనరియుండునూ- డఢణ-తథదధన-పఫయని - సరిదళంబులబీజములు షాట్కోణముండూ॥ ౧౪॥ అక్కరో షాట్కోణమంటివి-కోణమందునయున్న వివరమూ-త్వరితముగ దెలుపవమ్మయీపుడూ-తోయజాక్షీ॥ ౧౫॥ చెలియరో షాట్కోణమందున అగ్నిఘాతము నంటియుండునూ- శ్యామవార్ణము యిచ్ఛశక్తిచలగియుండూ॥ ౧౬॥ అక్కరో ఆయిచ్ఛశక్తి విధము దెలుపుము నీవుతిన్నగా- మాయయేమోగాప్పెనమ్మా-కాయమూలో॥ ౧౭॥ చెల్లెలు। అక్కా॥ యీమణిపూరకస్థానమందున-మాయగప్పీ-మనసుచెలింపుచున్నది-కన్నొనలయందు కానబడె- దృశ్య-దృశ్యములు-మునిగిపోయి- అంధకారమైయున్నది-అక్కడపలికె దశవిధనాదములు- ఘోరమైతోచుచున్నవి- నామీదకటాక్షముంచి-త్వరగా యీమాయనువిడిపించకున్న. యోగానకు మోసముగాయున్నది- అని ప్రార్థించిన- చెల్లెలిపలుకులకు అక్క సంతోషించి చిరినవ్వుతో యిట్లనియె॥



విష్ణయా చాపి శక్తి

త్రిపుట.

చెలియరో యేమమ్మయీవుడు-మాయగాప్పను మనసుపోర్లనూ -
కాయమూలో గురుణిమంత్రమూ-కలగజేయూ॥ ఉర॥ అకట-రోనీగురుణి
మాంత్రము తరచినాప్పుడె మాయవెరచనూ- కరిశనమ్మా - పూలవరష
మూ నీదుదయతో॥ ఉర॥

తోహరా॥ వేడుకలలరగయోగముజూచీ భోగము యిదీయనుచూ-
సౌఖ్యభూమిగ సత్యసాగరము సంతోషంబనుచూ॥ శ్రీ॥ నీలవేణియీకలికి
సుందరీ కాంతామెవరనుచూ-సూక్ష్మదేహమీ-సునీలరత్నము సుదతియవ్వ
రనుచూ॥శ్రీ॥గురుదేవాయనుచూ-శ్రితజనరక్షకుగనుచూ॥ చెన్నైలు॥ అకాట॥
నామనస్సు యిందువ-గురుడుయిచ్చినట్టి- ద్వాదశమంత్రం ఘటనజేసిన మా
త్రానసే-కన్నులయందు కప్పుకున్నమాయవీడిపోయి- పరిశుభ్రముగా బై
లైయున్నది- పూలవానపుగురిసెను- ఆబైలులోదృక్కు-నిలిపీ చూడగా-
వకచిత్రమైన సుందరి-యెట్లావున్నదంటే-పట్టుచీర- కలియపూలకంచుకము
తో-కాళ్ళకడెయాలు-పాంజేగజలతో-బంగారి సందిబొందె- సందిట- జంట
కడియాలతో-హస్తకంకణపసిడిగాజులతో - వ్రేళ్ళయుంగరములు- కుచ్చుల
కమ్మలతో-గజ్జటీక-పచ్చలపదకముతో-ముత్యాలహారములు-కుందనపుసత్తు
తో-పాపటబొట్టు-పకట-బాపిలీలతో- కుచ్చులబుగడలు- పెంచైనసొమ్ముల
తో-దగధగాయమానముగా-వెలిగె కిరీటముతో- శ్యామవర్ణముగలదేహము
తో-జాజిపూహారములు-జడనజుట్టి-దశదళములుగలపద్మమందున- ముత్యాల
గద్దైపై - వశియుంచియున్న - యీకిరీటి యెవరు - యీమె చరితమేమి -
యీమె నామధేయంబేమో - త్వరితముగా - ప్రసాదింపుమని - ప్రార్థిం
చెద॥

తోహరా॥ చెలియావినుయీ సుదతిశిరోమణి సాక్షిఅమ్మవారూ-
మోక్షద్వారమున సాక్షిమాత్రమై మొనశియుండుచూడూ॥ శ్రీ॥ పచ్చిపూ
లుయీపగులుదీటీలు చెల్లినశక్తిమ్మా- మండలాధిపతివిష్ణుమూర్తికి- పట్టపు
రణికొమ్మా॥ శ్రీగురుదేవాయనవే॥అకట॥ జ్ఞానస్వరూపిణి- చిత్తం-కుండలి
స్థానమందున విచలవిడెగా ఆరువేలహంసలు ఆడివిష్ణుకు అర్పణజేయు యీ
శక్తిలోనెపుట్టి అచటనేలణుగు యీమెనమ్మ యిచ్ఛాశక్తి యీ మహాదేవు
డైన విష్ణుమూర్తికి పూజజేసుకోవమ్మా- సుగిణీ॥ చెన్నైలు॥ యేమిపూలతో
పూజశాయవలెనో చప్పవమ్మా మహాదేవీ॥ అకట॥ అతను శ్యామవర్ణ దే

హంసలు గలవారు యింద్రనీలపుష్పాలతో పూజచేయవమ్మా॥సుగిణీ॥ ఆరువేల హంసలు జపపూజ విష్ణువు అర్పణ అవుతూవున్నది.

త్రిపుటం.

చెలియరో ఆయిచ్ఛాశక్తి- చలనమొందీలోకమందున - విచ్చలీచ్చ లుజేసునమ్మా - మనములోనా॥౨౦॥ అక్కరో ఆయిచ్ఛాశక్తి యీచ్ఛలీచ లునెటులజేసునో - యిప్పిచెప్పుము వివరముగనే యిందుకందూ॥ ౨౧॥ చెలియయీచ్ఛాశక్తి - కుండలిస్థానమందున ఆరువేలా - హంసలైనదిఆడు చుండునేవిచలిడిగా॥ ౨౨॥ అక్కరో యింకొకమాట సెలవులిమ్మని శర ణుజేశితి - సృష్టిలోపల విష్ణుమాయ నేవిధముయేమీ॥ ౨౩॥ చెలియరోవిను విష్ణుమాయకు కొష్టజీవుల కెల్లగలుగుసూ - గాక కారణ పురుషులకువదీ- గలుగబోనే॥ ౨౪॥ యట్లగలుగూనమ్మామాయా । యెట్లవిడుచూనమ్మనది యూ - పట్టువిడుపూ దెలుపవమ్మా పక్వమేమో॥ ౨౫॥ తెలిపేదను విన వమ్మచెల్లెల - యేను ప్రజపతిశూక్లశోణితా - మైనపిండము భువినబహన దీపూయత్తోనూ॥ ౨౬॥ అక్కరోభువిబడినపిండము - మాయవిడిచేమురుగు దెలుపుమూ - వేగదెలుపాలాగుయేమొ బెరశినాట్లూ॥ ౨౭॥ చెలియరో తమపూర్వకృతమే మాయబుట్టెది మాయగిట్టెది కారణంబున గురుణకరు ణతో కాలిపోనే॥ ౨౮॥ అక్క తెలిసేను అంతుదినములు సంశయించగనేటి కిఘనూ- తెలిశనమ్మా తేటతెలివిగా తెలిశ తెలిశా॥ ౨౯॥ చెలియతెలశితె కలశినాటైకారణంబున జూచినాటై - జేసినాటై గురునిశావా చెలియ నీవూ॥ ౩౦॥

మాలిని.

నిరుపమసుజ్ఞాన నిత్యకళ్యాణ - పరిపూర్ణ హృదిలోల- కరుణాల వాల - సురసేవితాహార సుకమానిలోల- శ్రీలక్ష్మీపరిపాల శ్రితజనలోలా ప్రహ్లాదవరశీల పాలాక్షుంలోలా॥

గద్యము॥ ఇది శ్రీమదఖిల విద్యత్కవి జేగియమాన సరసకవితానం త విద్యావిసేపానంతజ గద్గ్చన మహత్వసిథియుంగల జ్ఞానస్వరూపి ణ ఆత్మస్వరూపిణి అనే అక్కచెల్లెలి వేదాంత సంవాదంబునందు మణిపూ రక చక్రమహాత్మ్యము దశదళముల వర్ణనయు విష్ణువర్ణన యిచ్ఛాశక్తి వర్ణ నయు అచటి మాయాకల్పనలు గోపురద్వారవర్ణన పిండోత్పత్తినిర్ణయము సూక్ష్మమూర్తిఅనే అమ్మగారి తపోప్రభావంబున శ్రీవిష్ణు అర్పితముగ ఆ

ర్యులవారి కరుణాకటాక్షమువలన నిర్ణయించిన సహస్రారములోని తృతీయ్యా అశ్వాసము సంపూర్ణము॥

త్రిపుట.

అక్కరో మణిపూరకంబనే కమలమందున చెరితజూచితీ- అందుపైగాఅలరుచున్నా అతనుయావరూ॥ రాగ॥

జంపె.

దేదీప్యమానమై వెలుగుచుండినప్రభువు - నటుజూచిఆశెలీ హాశ్చర్యమొదవీ॥ యీప్రభూయెవ్వరో యీస్థానమెయ్యేదో - అగ్నిజ్వాలలవీల దహించుచున్నాదీ॥ యిపుడునామెందు నీకరుణాకటాక్షంబు - వుంచకుండినభయము దోచుచున్నాదీ ॥ అరమరలు శాయకను అక్కరో నీవిప్రుడు-త్వరగాను దెలుపమని శరణార్థజేశీ ॥ చెల్లెలు ॥ అక్కా యీస్థానమందున జటావల్కములు చాలనాగుపడిగెలతో దండక మండలముతో కాషాయ శిలములతో భస్మత్రిపుండ్రములతో గాయిత్రి రుద్రాక్షహారములతో యింద్రనీలచ్ఛాయగలదేహముతో రౌద్రాకారుడై ద్వాదశ దళములుగల పద్మమందున వ్యాఘ్రశింహాసనారూఢుండై వశియించియున్న యీమహానీయమూర్తియవరు యితనిచెరితమేమి వీరినామధేయంబేమొ విశదముగా బుద్ధి ప్రసాదింపుమని విన్నవించెద॥

జంపె.

యిదిఅనాహతస్థాన మిది అనాహతపద్మా - మిదిమహర్లోకంబు వివిధరో వినవే ॥ యీప్రభూరుద్రుండు యీపద్మమందుండూ - సందేహమునువిడచి సఖియరో జూడూ ॥ నీవుభయమనిఅంటివే అప్పుడునుచెలియా-భయమేమిగల్గు సద్గురుభక్తులకునూ ॥ నీయెందు సద్గురుని కరుణాకటాక్షంబు - సాలగాయున్నాది సందేహమిడవూ॥ అక్క॥ మంచిది జ్ఞానస్వరూపిణీ, సుగిణీ, అగణితంబైన యీ మహాస్థానమందు ప్రస్న చరితము విశదముగా తెలియజేతు ఆనందించుము సుగిణీ నీకు భూత్యముల పక్వము తెలుసునా వాటె ఫలాఫలములు అనుభవమెగదు అనుభవమేగానీ పూరా తెలియదమ్మా నీవు విశదముగా తెలియజాయావమ్మా అక్కగారూ॥ మంచిది అట్లాగెచెప్పెదవిను చిత్తం హంసఫలాఫలం ఆభూత్యములవివరం తెలియజేస్తువున్నారము॥

వారరత్నావళి - తత్వం - అటతాళం - భైరవిరాగం.

ఏమె చెలి మనయోగదృక్కుది వేడుకలరగ చూచినా - వొంటిగా నేజంటబాయక రెండుపైమొదలంటినా॥ ఏమె॥ ౧॥ ఆదివారమనంతభూపతి - స్వామిగురుదయగలిగినా - వేడుకలరగ యోగదృక్కుది యోగపురుషులుచూచినా॥ ఏమె॥ ౨॥ సోమవారముసోమభూపతి స్వామినీమముగలిగినా - కామితార్థము లెల్లయిచ్చును కల్లగాదది నిజమెగా॥ ఏమె॥ ౩॥ మంగళారమంగారభూపతి స్వామిగురుదయగలిగినా - సృంగరంబుగ అంనామణి బంగరంబని తెలియవే॥ ఏమె॥ ౪॥ బుధవారముభూత్యభూపతి సౌస్థమూతావొచ్చినా - మెచ్చుసంపదలిచ్చుభాగ్యము ముచటగగురుముదితరో॥ ఏమె॥ ౫॥ బేస్తవారముశాస్త్రభూపతి మాతృకాతానుండెనా- వాస్తముగఅదిపుణ్యక్షేత్రము కన్నులాగని చూచినా॥ ఏమె॥ ౬॥ శుక్రవారముచాక్రభూపతి పాక్యముగ ప్రభునిలిచినా - యెకువైనా యోగమదె చెలి ద్రూకుద్రూశ్యముచూడగా॥ ఏమె॥ ౭॥ శనివారముశామభూపతి స్వామిగురుదయగలిగినా - అందముగసుసుందరాంగి చెంద్రశేఖరుడంద్రుగా॥ ఏమె॥ ౮॥ ఏడుపట్లముతేమచక్రము లేలునేయీజగములో-అంచితంబుగ పంచమాలిదె సంచితంబిడనొట్టునే॥ ఏమె॥ ౯॥ చాలగాయీమాలబాట్టే త్రిప్పవేభూచక్రమూ - పాక్యముగయిదె పరిశవేనని లోహములసోకించవే॥ ఏమి॥ ౧౦॥ మాలయాలాకాలమేదో చూచివాలాలాడవే- చాలగానెమ్మూలలోయున బాలలాపోరాడవే॥ ఏమెచెలిమనయోగదృక్కుది-వేడుకలరగచూచినా॥ ౧౧॥ అక్క॥ జ్ఞానస్వరూపిణీ - సుగిణీ- నీకుయీసూత్రము తెలియదూ చిత్తం తెలుసుతెలిస్తే పరిపక్వముగాయుండుకుచూడలేదు॥ అనిన అక్కకు చెల్లెలు నమస్కరించి మనవి జేసుకొనుట॥

ఝంపతాళం - వచనతత్వము.

అక్కనీతోచిన్నదీ వకమనవిజేశేదున్నదీ - చినిమనవిజేశేదునదీ- ఆలకించీచెవినయుంచీ - ఆధరించూ కరుణవుంచీ॥ అక్క॥ ౧॥ యింటిలోపలచిన్నదీ॥ అదిఅంటిపెనగూచున్నది - కంటమొనతుద నంటియెంటనె జంటబాయకయున్నదీ॥ అక్క॥ ౨॥ వొంటిసంభము మేడలోవోరి పుంటితుదనాయున్నది - అంటరానటువంటిది ఆసొమ్ముభల్ప్రియమన్నది॥ అక్క॥ ౩॥ కానరానటువంటిది ఆకాంత్కన్నులకలికెదీ - సూజసుందరమైనది అదిచూపులోనేయున్నది॥ అక్క॥ ౪॥ కలికిసుందరిమూర్ధుగుమ్మా కమలపుంజేయు

న్నది - కన్నవారినిగన్నది అదియెన్నతరముగానిదీ॥ అక్క॥ ౫ ॥ భ్రమర వేచిగాజ్జలందేలు గాట్టిఆడుచున్నదీ - యీడపింగళజోడుగూడీ వేడుకాతో యున్నదీ॥ అక్క॥౬॥ సూక్ష్మబిలములోయున్నదీ అది సూపుకందారానిదీ- బాటదెలశినయోగపురుషుల చూటిలోనేనన్నదీ॥ అక్క॥ ౭॥ సరిగెబంగరు చీరది అదిమెరుగుబంగరుమోముదీ - కలియపువ్వులరవికెదీ ననుకలయరార మ్మన్నదీ॥ అక్క॥ ౮॥ కోటిమన్మధరూపది శ్రీకూటమంశేయున్నదీ-యేటి కెదురైయున్నది నకుసాటిలేరాటన్నదీ॥ అక్క ॥ ౯॥ సన్నదిడ్డినకన్నెదీ- వన్నెమీరీయున్నదీ - కన్నవారితోచిన్నిమాట లడిగిరారమ్మన్నదీ॥ అక్క॥ ౧౦॥ హేమవర్ణపుచిన్నదీ అదియెలవకూరానన్నదీ - జాడదెలియని మూఢభక్తుల పోరపోపొమ్మన్నదీ॥ అక్క ॥ ౧౧ ॥ పొద్దుబోడుపునయున్నదీ ఆ పొలతిచక్కనిగుమ్మదీ- యిమ్ముదెలశికమ్ముకున్నా అమ్మగారీసొమ్మదీ॥అక్క॥ ౧౨॥ ఆదిఅంత్యములేనిపదవి ఆత్మలోనేయున్నదీ - సుబ్బగురుణికరుణతోన సూక్ష్మమూర్తిగన్నదీ॥ అక్కనీతోచిన్నదీ వక మనవిజేశేదున్నదీ॥ ౧౩॥

కందార్థం. అకారయిఘునీవిప్పుడు । ఖండితముగపలికినట్టి- పలుకులు విని నాడెందమున తల్లడిల్లెను-గురియేమోదప్పెననుచూ గుండెలూబగిలేగ॥ మీరన్నపుడే భయమెంతోగలిగేగ॥ గుఱ్ఱాగ్రొంత్రగశేశీ పండ్లూగోరికీమీరు-భద్రాముయెన్నపుడే-భావాములో అకార-దిక్కు దెలియకయేమి వోచక-ఆత్మలోనా భయముదోచక- అడలుకుంటిని అమ్మయిపుడు యేది దప్పెనో యెమొనంచూ - గుండెలూబగిలేగ॥ మీరన్నపుడే భయమెంతో గలిగేగ॥

కందార్థం॥ కంకాళుబలుపరాక్రము-కంకాళునిబలము అంతయింతని తెలుపగ।అంతును దెలసిన బ్రహ్మంబొక్కడు- సంతనగాజేయుచుండూ నతనికీదాకార-యితరులకాదీ అలివానలేఖా - చకారగాశీ వాశీగురుడు న్నచోటుకూ-మకూరవాతో యెక్కి-మాయానుకడద్రొకార-యోగిబోగి త్యాగితానై-ముపురుమూర్తులమూలమూనై- యేమిగాకను-యేమిలేకను - వుండేప్రభుపూ యీరయోగీనతనీకీదాకార - యితరులకాదీ అలివానలేకార॥ అక్క॥

కందార్థములు॥ హరిహరులును-సురమునులును-గరుడోరగ బ్రహ్మ మొదలు దేవతలాదీగ-యేదని వెతకియుఆదీని- కనిగానాకాయిడగినారూ- గదవెమాతల్లీ-యక్కడదికూర- తెలియలేదనిరీ- నికారమాయిన మోక్షా

మెకాఁడున్నదోయాని-అకాఁరాతోవారూ అడవూలుజేరియూ - కాయ
గసురూ ఆకులలుమూ-ఆకటికి- బడవైచిమేపూ-మేకవటనే చెట్టుచెట్టూ-
గుట్టగుటూతిరిగి అలశెరీ॥ గదవేమాతల్లీ- యెకాఁడదికూాఁ తెలియూలేవనిరీ॥
కమ్మనిసొమ్మనిమదిలో నెమ్మదిగా రెంటెనీవు-నేర్పరివైబల్ - యిమ్మాడుక
యీటిరెంటను- సొమ్మనని తిరిగినీవూ శోధించినావూ - బలుభాద్రముగా
సాధించినావు॥ శోధించివేగామేసాధించివోస్తూవ- యిహపరముగంటేవి -
వివిధగోయీపుడూ-సంధితెలుసుకవినియునీవు-వివరముగ నేజెప్పుమాటలు-
మందమతివిడచాత్మలోపల-అందిపొందీ అమృతసారమూ॥ సాధించినావూ-
బలుభాద్రముగా శోధించినావూ॥ అకాఁ॥ సుగిణీ॥ గురుకటాక్షము నీకు
యేలగ్నాన యిచ్చినాడో - వారి అనుగ్రహముమువలన నీయోగముబాగా-
తెగుతూయున్నదమ్మా- సుగిణీ॥ చెల్లెలు॥ చిత్తం- అకాఁగారూ- సద్గురు
స్వామి అనుజ్ఞచేత-మీఅంతఃకరుణవలన-యింతవట్టుకు యోగంచూస్తుయు
న్న అకాఁ- మాయాకాంతమహిమలు- అనేకములుగలవు- మీదయయుం
టెనాకేమి-భయములేదు-రుద్రమూర్తి చరితమువెట్టిదో తెలుపవమ్మా -
మహాదేవీ-అకాఁ॥

త్రిపుట.

చెలియ అతడే రూద్రమూర్తి లోకములరాపూద్రమూర్తి- ప్రళ
యకాలమునాటిరూద్రుడూతూ అతడైనతడే॥ లా౧॥ అకాఁ రూద్రామూర్తి
యెంటివి లోకములరాపూద్రుడంటివి-ప్రళయకాలమునాటి రూద్రుని చరి
తమేమీ॥లా౩॥ మాటలు. అనాహతకమల నిర్ణయము వివరిస్తు యున్నాము.

త్రిపుట. చెలియహృదయాస్థానమందున- అనాహతమనె పాద్మ
ముండున్నూదళములుండును పదియురెండూ బాగుగానూ।లా౪॥అకాఁరో ఆ
హృదయస్థానమునందు పాద్మముయున్నిదళములా-వన్నెమీరియున్నవిధమూ
వరుసదెలుపూ॥లా౫॥ తెలిపెదను వినవమ్మ చెల్లెల పాద్మమునపండెడు దళ
ములూ- కఖగఘఙచఛజఝఞటఠయని- దళములందున బీజములునవి ద్వాద
శంబూ॥ లా౬॥ అకాఁరో నేమాకాఁ-వాతో కమలమందున చూడబోతే -
ఆమెయెవరోయున్నదమ్మా నీవుగానే॥ లా౭॥

జంపె.

ఇంత చకాఁని తల్లి యీఅమ్మవారెవరో- అనిచెప్పి సాష్టాంగము
నుజేసి లేచీ॥ యీరుద్రమూర్తికిని వామభాగమునందు - గద్దెపైనూర్చున్న

ముద్దుగుమ్మేవరూ॥ యీచిలుకలాకొలికి యీపల్లవాపాణి- పరమేష్టిరాణి యీ పడతియెవరమ్మా॥ ఆవందమునుబొంది ఆయకక్కసు మ్రొక్కి - శర ణార్థియంటియీశక్తి-యెవరమ్మా॥ చెల్లెలు॥ అకా॥ యీఅనాహతస్థానమందున- జలతారుచీర - పొగడపూలరవికతో - పచ్చలకడియాలు - పశిడిగాజులతో - పసపుకుంకుమ కన్నులకాటుకతో - నవరత్నఖచితమైనహారములతో - ముత్యాలకమ్మలు - వజ్రాలబావిలీలతో - చంపసరాలు జడకుచ్చులతో - ముత్యాలనత్తు పాపటబొట్టుతో - జిగుజిగు నిగనిగ మెరిశె కిరీటముతో - యింద్రనీలఛ్ఛాయగలదేహముతో జడనపూలు జెక్కి - పండ్రెండుదళములుగలపద్మమందున - ఆమహాదేవునియెడమభాగమందు - రత్నగద్దెపైవశియించి - భృత్యురాలై నమస్కరించుచున్న - ఆమహాదేవియెవరు - ఆమెచెరితమేమి - వారినామధేయంబేమొ - తెలియజేయుమని ప్రార్థించెద॥

జంపె.

నాముద్దు చెల్లెలా నాచిలుకనాకొలికీ - కలికిరోవిటురమ్మతినిపిలచినపుడూ॥ యీదేవతస్థాన మీచిద్విలాసంబు - చూడంగగలిగితివిసుకృతమేమందూ॥ యెన్నిజన్మములందో వెలయంగశివపూజ - చేసుకున్నవాఫలము నేడుశిద్ధించెనె॥ యీచక్కనీకాంత యీసాధ్విసద్గుణి - ఆరుద్రమూర్తి పట్టపురాణిదేవీ॥ అక్క॥ జ్ఞానస్వరూపిణీ- సుగుణీ- యీమెఆదిశక్తి- ఆరువేలహంసలు- రుద్రమూర్తికి-అర్పణ-యీశక్తి- లోనెపుట్టి- అచటనె అణగు-యీమెలోనేనమ్మశంభరవంపుండేది ఆమహాదేవుడైన-రుద్రమూర్తికి - పూజజేసుకోవమ్మ-సుగుణి-చెల్లెలు-యేమి పూలపూజశాయవలెనో- చెప్పవమ్మమహాదేవీ-యితను రుద్రమూర్తిగనుక - నీలపుఛాయగల పూలతో - పూజజేసుకోవమ్మా - సుగుణీ॥ ఆరువేలహంసలు - రుద్రునికి - జపజపూ అర్పణఅవుతుయున్నది॥

త్రిపుట

అదియెనమ్మా ఆదిశక్తి- భక్తితోనాశాంతకుంభవ- కాంతితోనాశంభరవమై చెలగుచుండూ॥ రార॥ అక్క-శంభారవమునదియా యచట బూట్టునో వెరుకపరుచు-సరుకుసేయక చెప్పవమ్మా సావిజ్ఞయేమో॥ రార॥ చెలియవాయు భూతమాదిశక్తి - లోనేపుట్టిరవమూ- ఆరువేలాహంసలైనదీ ఆడుచుండూ॥ రాం॥ అక్కరో అపుడంటివే యీలోకములరావూదవ్రిమూర్తినీ-అనగయేమో తెలుపవమ్మా తెల్లముగనూ॥ రాగ॥ కలికి

రో నామూర్ధ్నచెల్లెల కలియపువ్వులబంతిభక్తైడ-మల్లెపూజవ్వాజివేమరువం పుబోమ్మా॥ ౯౨॥ అక్కరో యీమరుగుదెలుపను అజునికైనా వశమట మ్మా - మరుగుదెలుపను నీవుగాక-మనములోనా॥ ౯౩॥ చెలియరో నను పొగడనేటికి-కృచ్చికృచ్చిఅడగనేటికీ-మేటిగుందువు గురుణిమంత్రము-చాటుయేశైౖ॥ ౯౪॥ అక్కరో సాద్గురుణికరుణతో సాటితినె యామేటిమంత్రము- వప్పవమ్మానీవుయీపుడ్డూచెప్పవమ్మా॥ ౯౫॥ చెలియవినవే చెప్పకే మీహృదయస్తానామందు ఆతను-వుండెలోకములెల్లగాల్చునే కర్మమతులా॥ ౯౬॥ అక్కఖర్మామతులగాల్చి కవితమేమోనాకు దెలుపుమూ- కరుణతోనాదెలుపవమ్మా కవితమిడచీ॥ ౯౭॥ చెలియరో యీరేడుజగముల గలిగియుండురెఖర్మజీవులు - వార్నిగాల్చునె రభసమునరావుద్రమూర్తై॥ ౯౮॥ అక్కరో ఆయింతుజెప్పము చింతదగిలెను శ్రీఘమీపుడూ- భక్తులను బాధించునేమో చాగదెలుపూ॥ ౯౯॥ యేమెచెలియా చలనమొందెవు మన సుపోశైవుమాయబోచ్చెవూ-కారణంబునగలయువారికి-కన్నతండ్రీ॥ ౧౦౦॥ అక్క॥ జ్ఞానస్వరూపిణి-సుగుణీ- నికొక్క-వినయంబు జెప్పెదవిను॥చిత్తం॥

తత్వం - ఆదితాళం - మధ్యమావతి.

చలనమిడచి గురుపాదముబట్టితె - అచలంబనుకోవే- వోచెలియా అచలంబనుకోవే-అచలమిడచినీవు చలనంబైతే చెడిపోయెవుగదవే- శివశివ చెడిపోయెవుగదవే॥ చలన॥ ౧॥ తనువూధనమూ మనమూ గురుణికదానంబనవలెనే- వోచెలియాదానంబనవలెనే- తనలోతానై తరచిచూచితే - తత్వంబనవలెనే॥ చలన॥౨॥ తనలోతానై తత్తరపడక తనువూగనవలెనే- వోచెలియా తనువూగనవలెనే- తనలోయున్నాక-పటబుద్ధులు తరణంబిడవలెనే॥ చలన॥౩॥ నాదూబిందూకళనాయుండే నాణ్యముగనవలెనే- వో చెలియా నాణ్యముగనవలెనే - నాదూబిందూలోపలయుండే యలపలగనవలెనే॥ చలన॥౪॥ యింటిలోమర్మము వివరించనుమరికంటిలో క-నవలెనే- వోచెలియాకంటిలో క-నవలెనే - అంటి ఆత్మలోరెంటెసందు ముక్కంటినగనవలెనే॥ చలన॥౫॥ మరుగూదెలశీమంత్రముతరచీమాయను విడవలెనే- వోచెలియా మాయనువిడవలెనే- కాయములోటీకారణపురుషుని కలసిమెలగవలెనే॥ చలన॥ ౬॥ మూడువేరులుగూడినచోటము మునిగితేలవలెనే - వోచెలియామునిగి తేలవలెనే- మునిగితేలినాతరణమె ముక్తికాంతను గనవలెనే॥ చల॥౭॥ ప్రణవాపీఠముయెక్కి-నిక్కి-నాథంబినవలెనె - వోచెలియా

నాదంబినవలెనే- గురుణికరుణతోసుగిణీనాదం గురుతుగవినవలెనే॥ చలన మిడచి గురుపాదముబట్టితె అచలంబనుకోవేః॥ అక్క॥ జ్ఞానస్వరూపిణీ॥ గురుయుపదేశంపొందినట్టెగాదు-గురుధర్మమార్గంబట్టిదమ్మా- సూక్ష్మము॥ చిత్తం॥చెల్లెలు॥ గురుకటాక్షంపొంది-నిష్టతోయుండినప్పటికి మాయపెద్దది-మీకుతెలియనిదేమున్నది - నాదొక చిన్నవిన్నపము - ఆలించి వినవమ్మ మహాదేవీ॥

తత్వం - శుద్ధసావేరి - రూపకం.

సుబ్బ గురుణికరుణగన్న సూక్ష్మమూర్తిభావమిన్న - యెన్నతరము గాదు లెమ్మ విన్నతత్వమూ-సుగిణి ఆకన్నతత్వమూ॥ ప్రజ్ఞవిడచి పరమ గురు సవిజ్ఞనొంది పొందినట్టి-సూక్ష్మమూర్తిభావములో చూచతత్వమూ-సుగుణిఅన్నతత్వమూసుబ్బ॥౨॥ మన్ననాతో అక్క-నీతో-మనవిజే స్తిచిన్ని మాట-చెన్నుమీరచూడరమ్మచడనితత్వమూ-సుగుణిఅన్నతత్వమూ॥సుబ్బ॥ ౩॥ గురుపుశిష్యధర్మమందు గురుతునిలిపియున్నవారి-ఆత్మలోన చెన్నుమీర అలరెతత్వమూ-సుగుణికన్నతత్వమూ॥ సుబ్బ॥౪॥ సోహమనేభావమునకు షోడశకళలుధారబోసి- సుబ్బగురుణిమహాత్మగన్న సూక్ష్మతత్వమూ- సుగిణి అన్నతత్వమూ॥ సుబ్బగురుణి కరుణగన్న సూక్ష్మమూర్తి భావమిన్న-యెన్నతరముగాదులెమ్మవిన్నతత్వమూ॥౫॥

చతుర్థస్కంధము సంపూర్ణము.

సద్గురార్పణమస్తు.

త్రిపుట.

అక్క-రో అనహతపద్మమునందుయుండిన చరితదెలిసెను - అందు పైగా అలరుచున్నా అతనుయెవరూ॥ ౧౦౧॥ అక్క యూప్రభుయెవ్వ రోమరి-చరితమేమో నామధేయము- స్థానమెయ్యదో దెలుపవమ్మా- తక్ష ణంబువ్వా॥ ౧౦౨॥ ఇంతసౌఖ్యంబైనకమలము- కలలోననైనా గానమెన్న దు-చూడసుందరమైనకమలము చూడగంటే॥ ౧౦౩॥ రేకుమొనలను దీపెకళి కెలకాంతికీపుడూ-నాకను నిలువజాలక తిరుగుచున్నదీ తెలుపుమేమో॥ ౧౦౪॥ కమలజలములు కొమరువెంబడి కాంతిగాకలహంసగమనలు-తిరుగు చున్నవి సొంపుగానే చూచితెమ్మా॥ ౧౦౫॥ చెల్లెలు॥ అక్కా- యూస్థాన మందున కౌపీన కటిసూత్రముతో-విభూతిరుద్రాక్షమాలికెతో- గాయిత్రి గందాక్షింతలతో- గదాఖడ్గ త్రిశూలముతో- నాగకంకణ- మకరకుండలా

భరణముతో స్ఫటికకాంతికి సమానమైన దేహముతో - జటావలయ శిఖ యందు భవానితో - యీప్రకారం- శేషభూషణకారము ధరియించి - పదహారుదళములుగల - పద్మమందున- క్రిష్ణాజ్జనాసనాశీనుండై- వశియిం చియున్న- యీమహాదేవుండెవరు - యితనిచరితమేమి - వీరినామధేయం బేమో- విశదముగా- తెలుపమని విన్నపింతును.

త్రిపుట.

చెలియ యిది యీశూద్ధస్థానము-మర్త్యలోకము యీశుడధిపతీ. జీవుడుండేస్తానమిదియే తెలుసుకోవమ్మా॥౧౦౬॥ కమలరేకుల కొనల దీపా చ౹ఁకేలున్నావంటివీవుదూ • చణికెలునుగాదమ్మనవియూ బిజకాట్లూ ॥ ౧౦౭॥ అఆఇఈఉఊలనియెడి బీజములు పదహారుయియుండునూ- తిరుగుచుం డును కమలరేకులాకొనలయందూ॥ ౧౦౮॥ కమలజలముల కొమరువెంబడి జీవహంసలు దిరుగుచుండునూ-స్వానభూమిది స్వాంతమూ త్రీసవుఖ్యమబ లా॥ ౧౦౯॥ స్వావభూమిలోమలయమారుతమీచుచుండును యీశ్వరుణికీ- పరమహంసలు దిరుగుచుండునే పక్వముగనూ॥౧౧౦॥అక్క॥ సుగుణీ- అగ ణితంబైన-యీమహస్థానమందున్న-చరితము తెలియజేతును- విను- చిత్తం॥

త్రిపుట. చెలియరో యెడేడు జగముల అంటిఅంటక ఆత్మావిధు డై - యుండెపభ్రువూ అతడెనమ్మా- యీశ్వరుండూ॥ ౧౧౧॥ అక్క అతను ఆత్మవిధుడని చెప్పితివి యా తెరగుయేమో- తెలుపవమ్మాయీశ్వ నాధుని చరితమేమో॥ ౧౧౨॥

మాటలు. విశుద్ధకమలనిర్ణయము వివరిస్తుయున్నాము.

త్రిపుట.

చెలియరో విశుద్ధమనియేటి కమలమున పదహారు రేకులు- అఆఇఈ ఉఊ ఋౠలులూఎఐఓఔఅంఅః యని - రేకులందున స్వరములుండునే షోడశంబూ॥ ౧౧౩॥ అక్కరో ఆదళములందున స్వరములుండె సొంపు దెలుపుము- యెంతసుందరమమ్మ కమలమూ యిందువదనా॥ ౧౧౪॥ చెలి యరో యీకమలమేమిలె దీనిసుందరమేమిచూడను- వేయురేకుల కమలము న్నదీ దానిజూడూ॥ ౧౧౫॥ అక్క మొక్కితి స్రొక్కి స్రొక్కి కమలపాద్మ ముతెక్కనికీ-చూడగలిగితి నీదుదయతో సూక్ష్మమతినై॥ ౧౧౬॥ చెలియ రో యేమమ్మనీవు సారెసారెకునన్ను మెచ్చేవు - కరుణయిచ్చిన గురుణి మెచ్చవే కలికనీవూ॥ ౧౧౭॥ అక్కరోనాకుగురుణికరుణా గలిగియుండెవి

నీకే తెలుసునూ-గాక యెవ్వరికేమి దెలుసూ యెరుకమరుపూ॥౧౧౮॥ తెలుసునమ్మా యోగగుమ్మా గురుణికరుణా గలిగియుండెదీ-కాగ నేనే జెప్పగలిగితి కలికనీకూ॥౧౧౯॥ అక్కరో అవునమ్మ నిజమే చెప్పితివి నేవొప్పితినీమరి॥ గురుతుగా నెచూడనాయెను- గురుణిచరణం॥ ౧౨౦॥ చెలియరో నన్నడిగితివి కాదళము లేమని స్వరములేమనీ- చెప్పెదనువినవమ్మ యీవుడు చెలియనీకూ॥ ౧౨౧॥ బుద్ధిఅల్లనె చెప్పవమ్మా స్వరములందున పరవమేమో-విరివిగానది దెలుపవమ్మా యిందుకందూ॥౧౨౨॥ చెలియరో పదహారుస్వరములు పలుకునవి పదహారుకళలతో - పుట్టునేవొకొక్క-స్వరముకూ బుద్ధిలెన్నో॥ ౧౨౩॥ అక్కరో నేనిన్నగలిగిన కమలమందున జూడబోతే-శక్తియున్నదియేమొగానీ పద్మమందూ॥ ౧౨౪॥ శక్తిముఖమున పంచకళలూ దేలుచున్నవి స్పటికె కాంతితో-యిట్టిదేహముగలుగుకాంతను గానమెవ్వడూ॥ ౧౨౫॥ పూలుగంధము పునుగుజౌవజి చాలగామేనంటినలదీ - హారములుధరియించుకున్నా యమ్మయెవరూ॥౧౨౬॥ యిన్నిస్థానములందు జూచితి యిట్టిస్థానము యింతసౌఖ్యము- లేదుయిచటీ స్వానభూమికే చెల్లునచూ॥ ౧౨౭॥ హంసగమనలు హంసయానలు ఆడుచున్నవి శక్తియెదటనూ- యీమెయెవరో దెలుపవమ్మా అక్కగారూ॥ ౧౨౮॥ అక్కరో యీస్వానభూమికి వొచ్చినావుడె దేహము - శాంతినొందెను చల్లనాయెను స్వాంతముగనూ॥ ౧౨౯॥ చెల్లెలు॥ అక్కా- యీస్థానమందున- మేఘనాదం చెవులపండువుగా- వినేటప్పుడు- నేత్రదృక్కు-నిలిపిచూడగ - అక్కడ కానబడెవొస్తువ-పట్టుకెంభావతి- కలియపూలకంచుకముతో - కాళ్లకడియాలు-అందెలతో- బాజీబందుకుచ్చులతో- హస్తకంకణపశిణిగాజులతో - సంకుటుంగరములు-కుచ్చులకమ్మలతో - గజ్జలటీక-పచ్చలపదకముతో- ముత్యాలహారములు-కుందనపునత్తుతో- పాపటబొట్టు-పక్క-బావిరీలతో- ధగధగాయమానముగ- వెలిగేకిరీటముతో - స్పటికె వర్ణముగల దేహముతో జాజిపూలహారములు- జడనచుట్టి - పదహారుదళములుగల పద్మమందున - ముత్యాలగద్దెపై నిష్టాగరిష్టురాలై- వసియించియున్న యీకిరీటియెవరు- యీమెచరితమేమి - వీరినామధేయంబేమొ - త్వరితముగా - తెలుపమని ప్రార్థించెద-

త్రిపుట. చెలియరో నీవెరుక బంగరు భాగ్యమైనకుదోచుచున్నదీ- విటులరమ్మా ముద్దుగుమ్మని అలుసుకొనేసూ॥ ౧౩౦॥ వెరుకె నీత్యము

వెరుకసాత్యము-వెరుకెమూర్తి వెరుకెభక్తి - వెరుకయీట్టిదటంచు బలుకనూ యెవరికలివీ॥ ౧౩౧॥ పులదండలు పునుగుజవ్వాజీమేలుగా మేనంటవినలదీ- వున్నకాంతా యీమెనమ్మా పరాశక్తి॥ ౧౩౨॥ ఇన్నిస్తానములందు దేవశ పూజజేశే నీవుకన్నులా - చూచి అనుభము మాకుజెప్పితీవంతెచాలూ॥ ౧౩౩॥ అక్క॥ జ్ఞానస్వరూపిణీ॥-చిత్తం॥ యీమహదేవే పరాశక్తి- యీమెలో మేఘనాధంపుట్టి-యెురలువిడుచు - దశశతహంసలు- యీశ్వరుణికి అర్పణ-యీశక్తిలోనెపుట్టి- అచటనెఅణుగు- ఆమెనమ్మపరాశక్తి - యీమహదేవునికె పూజజేసుకోవమ్మా- సుగుణీ - యేమిపూలపూజజేతునమ్మ పేరికీ-తెల్లటిపూలయందుభ్రమగనుక- తుమ్మిపూలపూజజేయవమ్మ- సుగుణీ-దశశతహంసలు యీశ్వరుణికి- జపపూజఅర్పణఅవుతూయున్నది- సుగుణీ - చిత్తం - ఆత్మజపపూజమైయేదేమో అవుతూయున్నది - నీవు యీశ్వరుణికె అష్టోత్తరనామములు- పూజజేసుకోవమ్మ - తుమ్మిపూలతో- అట్లజేసుకున్నట్టయితె- ముక్తికాంతదరిశనంనీకు - త్వరగా అవుతూయున్నది॥ అని చెప్పిన అక్కకునమస్కరించి, చెల్లెలు బుద్ధి ,అల్లాగేచేసెదనమ్మా- మహదేవీ॥

### యోగగుమ్మ - యీశ్వరుణికి - పూజజేసె విధాయం.
### అష్టోత్తరనామములు.

ఓం యేకలింగాయనమః, ఓం యేకలింగపూజాయనమః, ఓం వేదాంతవేధ్యాయనమః, ఓంద్రిలింగపూజాయనమః, ఓందీక్షలింగపూజాయనమః, ఓంత్రిలింగపూజాయనమః, ఓంఆచారలింగపూజాయనమః, ఓం చతురులింగపూజాయనమః, ఓంజీవలింగపూజాయనమః, ఓంపంచలింగపూజాయనమః, ఓంప్రాణిలింగపూజాయనమః, ఓంషడులింగపూజాయనమః, ఓంసౌఖ్యలింగపూజాయనమః, ఓంసప్తలింగపూజాయనమః, ఓం ఆయిక్యలింగపూజాయనమః, ఓంఅష్టలింగపూజాయనమః, ఓంఆత్మఅయిక్యలింగపూజాయనమః, ఓంయిష్టలింగపూజాయనమః, ఓంనవలింగపూజాయనమః, ఓంప్రణవలింగపూజాయనమః, ఓందశలింగపూజాయనమః, ఓంయేకాదశలింగపూజాయనమః,ఓంద్వాదశలింగపూజాయనమః,ఓంపరమాత్మాయనమః, ఓంషోడశలింగపూజాయనమః, ఓంస్వాంతలింగపూజాయనమః, ఓంసహస్రలింగపూజాయనమః.

ధ్యానం॥ ఓంగణేశ్వరాయనమః, ఓంవిఘ్నేశ్వరాయనమః, ఓం గరళకంఠాయనమః, ఓంత్రిపురాంతకాయనమః, ఓంత్రిమూర్త్యాత్మాయన మః. ఓంఫాలనేత్రాయనమః, ఓంపరమేశ్వరాయనమః, ఓంవిమలలింగా యనమః, ఓం వీరలింగాయనమః, ఓం అమృతలింగాయనమః, ఓం ఆనంద లింగాయనమః, ఓం నిత్యానందాయనమః, ఓం నిర్వికల్పాయనమః, ఓం ని త్యానందస్వరూపాయనమః, ఓం సచ్చితానందస్వరూపాయనమః, ఓం సర్వాయనమః, ఓం సర్వరూపాయనమః॥

పూజావిధానం.

ఓం దివ్యలింగపూజాయనమః, ఓం సద్గురులింగ పూజాయనమః, ఓం సర్వలింగపూజాయనమః, ఓం సర్వపూజాయనమః, ఓం నిర్వికల్ప ని త్యానంద లింగపూజాయనమః, ఓం సత్యతానంద స్వరూపాయ న మః, ఓం స్థూలలింగపూజాయనమః, ఓం సూక్ష్మలింగ పూజాయనమః, ఓం ముఖ్యలింగపూజాయనమః, ఓం ప్రసాదలింగపూజాయనమః, ఓం గురుప్రసాదలింగపూజాయనమః, ఓం ఆధారలింగపూజాయనమః, ఓం స్వాధిష్టలింగపూజాయనమః, ఓం మణిపూరకలింగపూజాయనమః, ఓం అనాహతలింగపూజాయనమః, ఓం విశుద్ధలింగపూజాయనమః, ఓం ఆజ్ఞే యలింగపూజాయనమః, ఓం అష్టదళపద్మ అవిశర్యలింగపూజాయనమః, సహస్రలింగపూజాయనమః॥

అక్షరధ్యానం.

ఓం యేకాక్షరాయనమః, ఓం ద్రియాక్షరాయనమః, ఓం త్రియా క్షరాయనమః, ఓంచతురాక్షరాయనమః, ఓంపంచాక్షరాయనమః, ఓంష డాక్షరాయనమః, ఓంసప్తాక్షరాయనమః, ఓంఅష్టాక్షరాయనమః, ఓం నవాక్షరాయనమః, ఓం దశాక్షరాయనమః, ఓం యేకాదశాక్షరాయన మః, ఓం ద్వాదశాక్షరాయనమః, ఓం షోడశాక్షరాయనమః, ఓం సహ స్రాక్షరాయనమః, ఓం సద్గురులింగాయనమః॥

హంస సద్గురుస్వామికి జపపూజచేసేవిధాయకం.

ఓం ఆచారలింగాయనమః, ఓం ఆరునూరు జపపూజాయనమః, ఓం గురులింగాయనమః, ఓం ఆరువేలుజపపూజాయనమః, ఓం శివలింగా యనమః, ఓం ఆరువేలుజపపూజాయనమః, ఓం శరలింగాయనమః, ఓం ఆరువేలు జపపూజాయనమః, ఓం ప్రసాదలింగాయనమః, ఓం దశశతజ

పపూజాయనమః, ఓం సదాశివలింగాయనమః, ఓం సహస్రజపపూజాయనమః- ఓం సద్గురులింగాయనమః, ఓం సహస్రసంపూర్ణ జపపూజాయనమః॥

మంత్రధ్యానం.

ఓం ఆచారలింగార్పణ స్థూలపంచాక్షరి ఆరునూరు జపపూజాయనమః, ఓం గురులింగార్పణ సూక్ష్మపంచాక్షరి అయిదు వేలు జపపూజాయనమః. ఓం శివలింగార్పణ ఐక్యపంచాక్షరి అయిదు వేలు జపపూజాయనమః, ఓం శరలింగార్పణ మూలపంచాక్షరి అయిదు వేలు జపపూజాయనమః, ఓం ప్రసాదలింగార్పణ ప్రసాదపంచాక్షరి తొమ్మనూర్మరు జపపూజాయనమః, ఓం సదాశివలింగార్పణ మొతిమూలపంచాక్షరి తొమ్మనూర్మరు జపపూజాయనమః, ఓం సద్గురులింగార్పణ గురుప్రసాద పంచాక్షరి తొమ్మనూర్మరు జపపూజాయనమః, ఓం అకారపూజాయనమః, ఓం వుకారపూజాయనమః, ఓం మకారపూజాయనమః, ఓం సకారపూజాయనమః, ఓం ఓంకారపూజాయనమః, ఓంసత్యపూజాయనమః, ఓంనిత్యపూజాయనమః, ఓంనిర్వికల్పనిరంజనపూజాయనమః, ఓంసర్వపూజాయనమః

కంఠార్థములు॥ సద్గురువు కరుణనాపై । చాలగగలిగున్నదనుచుసంభ్రిముతోడన్ । యీసొమ్మయింతదనుచును । గట్టిగమరిలేకఁబెట్టే ఘనులెవ్వారనుచూ । ఎవ్వరికైనా అలిపిగాదనుచూ॥ అనియిట్లుఆచెలియా ఆత్మాలొపూహించి - గురుమహాత్మదలచి సద్గురుణె సేవింపూచూ॥ యితరములు మదివేమిలేకను - అటులవిటులాగదలకానూ - నిటలమందున మెరుఁబెట్టి స్పటికలింగముజూచుచుండే - ఘనులెవ్వారనుచూ - ఎవ్వరికైనా అలివిగాదనుచూ॥

ఈహంసయిన్ని విధముల। వర్ణముతై సంచరించి వనరుగమరియున్। మెచ్చోటనిలచియుండునో। నచ్చోటుము దెలుపుమిపుడూ॥ అకాఁ క్రమొకెఁదనూ - అనుమానావూ యుంచాకీమెడనూ - క్రొంచామాయినకుక్షి కోటీలోపలహంసా - విహారించీతిరిగొచ్చి నిలచుండేదది దెలుపూ ॥ తామశించక తాళిముంచీ - తల్లినీతన యనుచుమెంచీ - అనుచుబలికి సంతోషించి హంసరహస్యము నదియు దెలుపూ- అకాఁ క్రమొకెఁదనూ - అనుమానామూ యుంచాకీమెడనూ॥ చెల్లెలు॥ అకాఁ నీయిష్టప్రకారం యీశ్వరుణికి అష్టోత్తరనామములు పూజజేశితి- హంసరహశ్యం- పరాశక్తి చరితము దెలుపవమ్మా మహాదేవీ, అనినచెల్లెలికి అకఁ చెప్పదొణగె॥

కందార్థములు॥ బ్రహ్మోపదేశమార్గము । సోమ్మోననినమ్మి మొదట సయ్యామయోగుల్ । సాధింపుచుశోధింపుచు। ఆదినిగనిశించలేకా అల్లాడినారూ - అమ్మావారూ మల్లాడనారూ॥ పరమహంసలబట్టీమాయానుచేదట్టీ- సోహామనుసెప్పదూ శోధింపుచుండీనా ॥ అందిరాకను అలివిగాకను ఆమరాళినిబట్టిలేకను - సందేహంబదివిడువలేకను - కాలతరికనిసించలేకా- అల్లాడీనారూ - అమ్మావారూమల్లాడినారూ॥ ఆధారము- స్వాధిష్టము-మణిపూరక - మనాహత విశుద్ధమనగా - ఆగ్నేయమందునిలుకొని - సహస్రారము వరకునదియూ - సాగూచుండునుగా - యీహంసూడూ ఏగూచుండునుగా - మండాలాములయెందూ మరియెక్కిదిగుచూనూ - కుండాలిస్థానమునా.గూడూక యీరెండూ- జోడుగూడీ వేడుకాతో జాడదీశీమేడమీదికి - ముక్తికాంతనుగలయబోయీ - మురియుచునున్నవి మరలదిరిగీ- సాగూచుండునుగా - యీహంసూడూ ఏగూచుండునుగా॥ చెలియానేనీకిప్పుడు గోప్యముగా నాటిజేయు - హంసలువినవే - హరిబ్రహ్మాదులకైననునలవిమె మేరుషులకైనా - అందానువశమా - యీహంసాలా పొందానువశమా॥ అందీపొందగలేకా సందేహమునువిడకా - గురుమూర్తి కృపలేకా - గురుతూదెలియకాదీ॥ నాదీనీదనెభేదములతో వాదులాడుచు క్రోధములచే-భంగపడుచును అంగరహితము సంగమేదో తెలియకాదీ॥ అందానూవశమా - యీహంసాలా పొందానూవశమా॥

త్రిపుట.

అదియెనమ్మా పరకుపరమై పరాశక్తై - పాద్మమందున - స్పటికవర్ణముగలిగియుండునే - నందముగనూ॥ ౧౩౪॥ అక్కరోఆస్పటికవార్ణము నందభావమునాకుదెలుపుము - తెలుపవమ్మానీవుయీప్పుడూ - తెలుపు తెలుపూ॥ ౧౩౫॥ చెలియరోఆకాశభూతము నంటియుండునెనాదమినుచూ-మోదమూతో మేఘనాదము మొరలులిడుచూ॥౧౩౬॥ అక్కరోఆమేఘనాదము సోధదెలుపుము సొంపుమీరగా - పెంపుయేమొ దెలుపవమ్మా ప్రేమతోనూ॥ ౧౩౭॥ చెలియరోఆమేఘనాదము పలుకుచుండునో పరాశక్తిలో - దశశతంబులహంసలైనది - ఆడుచుండూ॥ ౧౩౮॥ అక్కరో ఆయిశ్వనాధుడు అంటిఅంటడు ఆత్మవిధుడనీ- చెప్పితివిఆవివరమేమొ తేటపరుచూ॥౧౩౯॥ చెలియవినుయీయీశ్వరుండూ అలరుమను అందరిలోయుండును- పండియుండానందముగమదీ భరితుడగుచు॥౧౪౦॥ అక్కరోఆనం

దమూర్తీ అంటిఅంటనివిధము దెలుపుము- తెలుపవమ్మా నీవుయిప్పుడూ తెలుపు తెలుపూ॥ ౧౪౧॥ చెలియరో ఆసూక్ష్మబిలములో చూచుచుండెటి యోగపురుషుల - నంటియుండునె ఆత్మవిధుడైనందమూర్తీ॥ ౧౪౨॥ అక్కరో అతడంటియుండెడి అంతు దెలిశెను సంతోషంబున - అంటియుండనివిధము దెలుపుము సంతసముగా॥ ౧౪౩॥ చెలియరో యేడేడుజగముల హింసజేతురె పాపమెంచక - వారినలటడెయెప్పటికిమరీ వసుధలోను॥ ౧౪౪॥

మాలిని॥ శ్రీపార్వతీమనోహర పరమేశ్వరభక్తపాల - పరోపకారా - సురసేవితగళకంఠ సుందరకారా - యిందుధరానందీశ్వరపాహి మాం పాహిమాం॥

గద్యము॥ ఇది శ్రీమదఖిల విద్యత్కవి జేగీయ్యమాన సరసకవితానంత విద్యావిశేషానంత జగణార్చన మహత్వశిద్ధియుక్తగల జ్ఞానస్వరూపిణి ఆత్మస్వరూపిణి అనే అక్కచెల్లెలి వేదాంతసంవాదంబునందు చెల్లెలికి అక్కబోధించిన సహస్రారములో చతుస్కంధము అనాహత మహత్యము ద్వాదశదళములుగల పద్మవర్ణనయు ఆపద్మమందుండిన రుద్రమూర్తిమహత్యము ఆదిశక్తివర్ణన వారిరత్నావళి తత్వఫలము వచనతత్వ మహత్యము పంచమస్కంధమునందుండిన విశుద్ధకమలవిచారణ యీశ్వరవర్ణన పరాశక్తివర్ణన షోడశరేకులుగలిగిన కమలమందువుండిన బీజములమహత్యము కొలన పరమహంసల చిద్విలాసం యీశ్వరుని అష్టోత్తర నామములు సూక్ష్మమూర్తి తపోమహత్యమువల్ల పరమేశ్వరఅర్పితముగా నిర్ణయించిన చతుర్థస్కంధము పంచమస్కంధము సంపూర్ణము॥

త్రిపుట.

అక్కరో విశుద్ధకమలము నందుయుండినచెరిత దెసిశెను - అందుపైగాచూడబోతే కండ్లుదిరిగేం॥ ౧౪౫॥ యేమచెలియా కండ్లుదిరుగను కారణంబున గురుతుదాప్పను- కరుణయిచ్చిన గురునిమంత్రము తరువలేదా॥ ౧౪౬॥ అక్కరో నాకేమికానీ కండ్లుతిరిగేనమ్మయిప్పుడూ - యేమొకానీ కండ్లుదిరిగేనమ్మనాకూ॥ ౧౪౭॥ చెలియభాద్రామమ్మయిప్పుడూ మనసుజెరిచెవుసూటిదాప్పవు- గురుతుదాప్పవమ్మయిప్పుడుభక్తిచెడినీ॥౧౪౮॥ అక్కరో నేగురుణిమంత్రము - గురుతుదప్పక సూటిదాపక - చూడబోతే యెక్కినీక్క అందదేమీ॥ ౧౪౯॥ జారెవమ్మా చెలియనీవు భద్రముబాద్రాముజారేవు - కదలకుండాయెక్కిచూడుము యెరుకతోనూ॥ ౧౫౦॥ అక్క

రోనేకదలకుండా పాట్టుబాట్టీవదలకుండా - నిలచిమెరుకతొ చూడబైగా సందడేమి॥ ౧౫౧॥

వచనం॥ త్రివేణిసంగం వివరిస్తూ యున్నాము.

త్రిపుట.

చెలియరో విను ప్రణవపీఠము నందుయెప్పుడు సందడుండును- కోలహాలము గలిగియుండు కోల్లాటమందూ॥ ౧౫౨॥ అక్కరో ఆప్రణవపీఠము పైనజేరే పాటుదెలుపుమా- దిట్టముగ నేనెక్కచూతును స్రిష్టముగనూ॥ ౧౫౩॥ చెలియరో నీగురువుజేప్పిన పాట్టుచాతను బాట్టిహంసల - దిట్టతనముగయేక్కవమ్మా దివ్యమణిగో॥ ౧౫౪॥ అక్కరో నాగురువుజేప్పిన పాట్టుచాతను బాట్టిహంసలా - యెక్కబోతే యెన్నోవిధముల నాదమేమీ॥ ౧౫౫॥ చెలియరో ఆప్రణవపీఠము నందుయుండును పంచవిధముల - ప్రణవ భేరీపంచధ్వనులతో పలుకుచుండూ॥ ౧౫౬॥ అక్కరో ఆప్రణవ భేరీ ప్రణవనాదమువినగకనగా- పీఠమున్నదె నాణ్యముగనవారత్నములతో॥ ౧౫౭॥

తోహరా॥ పరశివమూర్తినిదలచి పరమమంత్రిమేతరచి- పీఠముజూచీసంతోషించి సాగిలిమొక్కుచునూ- పీటముజేశినిర్మించినశిలిపికి దండము బెట్టుచునూ॥ తరివెనకనకపుకోళ్లునుమరియు పచ్చలకుచ్చులునూ - పగడపు పట్టైలుదంతపుపూలు జివరేకలతోనూ॥ పరశివ॥ నవరత్నములతొశోభిల్లెడి యీ పీఠనువర్ణించి- అక్కాయీస్థానము యెవ్వేది పీఠమహాత్యమేమో॥ పర॥ అక్కాయిపుడీస్థానమహాత్యమూ పీఠనువేడుకా - త్వరగాదెలుపుమువివరముగానే తోయజాక్షియీకా॥ పరశివ॥ చెల్లెలు॥ అక్కా - యీ ప్రణవమందు- నవరత్నఖచితమైనపీఠము దేదీప్యమానమైయున్నది - ధగధగాయమానముగావెలుగుచున్న- పీఠముచూడడానకు - కన్నునిలువజాలదుగదమ్మా- యెంతసుందరమైనపీఠమమ్మా- మహాదేవి॥

తోహరా॥ పరశివమూర్తినిగనుడే పరమమంత్రమేఅనుడీ॥ చెలియావినుయీపీటమహాత్మ్యమూ యవ్వరికేమెరుకా- యెతులుయేకాంగులు మానులుజూచే మహాస్థలమిదిగనుకా॥ పరశివ॥ హరిహరబ్రహ్మ సురపతికైనను అందరానిదమ్మా- పీటముజేశిన మహానియమూ శ్రీ విశ్వఖర్మకొమ్మా॥ పరశివ॥ ప్రణవపీఠమిది త్రివేణిసంగము నిజముగవినవమ్మా- ముక్తిభాటయిది శెక్తిపురుషులకు ముఖ్యముగాకొమ్మా॥ పరశివమూర్తిని గనుడీ॥ అక్కా॥ యీ సుందరమైనప్రణవపీఠము- చూడడానకు నీపుణ్యమెంతని చెపుదమ్మా-

సుగిణీ యెతులు యోగులు మౌనులు- మహాత్ములు మహాపెద్దలు రుషులు- జ్ఞానులు దిగంబరులు- యేకాంగులు- అవుధూతలు వుదాసులు- పరమహంసలు యిట్లు అనేక మహనీయులందరు- యీ ప్రణవపీఠమందు వశియించి- సంతోషించి తరువాత లేచి త్రివేణిలోగంగస్తానముజేసి మోక్షానకుపోయి నారమ్మా- సుగుణీ॥ యీ ప్రణవపీఠము యెక్కవమ్మా- త్వరగాఆలశ్యం శాయకా॥

త్రిపుట.

అదియేనమ్మాప్రణవపీఠము యేక్కుయేక్కుమునీవుత్వరితము- యెక్కవమ్మాప్రణవపీఠముయోగగుమ్మా॥ ౧౮॥ అనుచుబలికిన అక్కపాదములందువ్రాలిగి శరణుజేశీ - శలవుదీసుక ప్రణవపీఠము యెక్కీ నిలచా॥ ౧౯॥ యెక్కితివెనాముద్దుచెల్లెల ప్రణవపీఠమునీవుయీప్పుడూ- యెందుజూచినమింటబెట్టిన దీపమగుదూ॥ ౨౦॥ అక్కరోనీకరుణచేతను ప్రణవపీఠముయెక్కగలిగితి- యింతదూరముచూడనాయెనుయిందువదనా॥౨౧॥ చూడవమ్మాసుందరాంగి వేడవమ్మాగురునిమంత్రము- పాడవమ్మాపాద్మ గంధీప్రణవమందూ॥ ౨౨॥ అక్కప్రణవాపీఠపైనా పాల్లిపారేప్రభవమేమి- మూడువిధములకలశిపారే మచ్చలేమీ॥ ౨౩॥ అదియేనమ్మా గంగ సరస్వతిగవిరియుండే స్థానమెప్పుడూ- పొంగిపారునెమొరలుపెట్టుచు సంగమందూ॥ ౨౪॥ అక్కరో నేపొంగిపారే గంగయెందున చూడబోతే- గంగస్తానము జేయుచున్నా గరితలెవరూ॥ ౨౫॥

తోహరా॥ సదశివమూర్తినిదలచీ యాసద్గురు మంత్రముతరచీ॥ ఆకాయిపుడీచక్కనిగరితెలు వీరలెవ్వరమ్మా-మక్కువతోనేవినగోరితినీవివరించుదురమ్మా॥ సదశివ॥ నవ్వితేఫక్కున పలువరసా ఘదివేలుజేసునమ్మా- మల్లెరేకులకు బోలినకన్నులు మెల్ల చూపులమ్మా॥ సదశివ॥ వేలకుదీరిన సొమ్ములుమెడలో వేసుకున్నరమ్మా- కోలహాలముగనబ్ధిలోమునిగి తేలుచున్నరమ్మా॥ సద ॥ పున్నపవెన్నెల పాలుమొఘమునా తొనుకులాడు నమ్మా- కన్నెలమొఘమున వెన్నెలకాంత్తీ యేమి జెప్పదమ్మా॥ సదశివ॥ చెల్లెలు॥ అక్కా యీత్రివేణిసంగమందున చూడగా- ఆచిద్విలాసముచిత్రమైతోచుచున్నది- అహాహా యేమనిచెప్పదమ్మా॥ అక్క॥ సుగుణీ-యేమిచిత్రమైతోచుచున్నదో చెపుమా- మూడువిధములచేతకలశిపారెగంగ- విరుపార్శ్వములయెందు యిసకదిన్నెలపైన- పూపొదరిండ్లుసంపంగిలతలు- సన్నజాజులు


సరస్వతి
గంగ
గౌరి
ప్రణవపీఠం

చామంతిబంతులు- చంగల్వపూలు- మరువంపుమొగ్గలు- మాసుపత్రి-మొగలిగుంపులు- గేదంగిచెండ్లు- వికశించిన జాజిపుష్పములపై తుమ్మెదలు వాలుతూ- సర్పములు ఆడుతూ- పొన్నపొగడ- పారుజాత- ఫలవృక్షములచాత వొప్పియున్న యీసంగమందున- త్రివేణిఘోషకు- మారుతము వీచాగా- పుష్పగుములుతూగగా- వాటిసువాసన ఆఘ్రాణింపుచూ పుష్పములువకరి మీదవకరు సల్లుకొనుచు- జడకుచ్చులతోకొట్టుకొనుచు- తగలకుండ తప్పించుకొనిమునిగితేలుచూ- నద్ధినాధంచెవులవింటూ- ఆత్మలోఆనందపడుచూ- ఆభరణములుధరియించుకొని- చిరినవ్వుతోస్త్రానముజేయుచున్న- యీచకోరని కలకంతులెవరు- వీరిచెరితమేమి వీరినామధేయంబేమొ - విశదముగాతెలియజేయుమని విన్నవింతుము॥

తోరా॥ సదశివమూర్తినిదలచవే సద్గురుమంత్రమె అనవె॥ చూస్తివె చెలియావారివేడుకా కనులపండుగానూ- నద్ధినాదమువింటివెనీవు చెవులనిండగానూ॥ సదశివ॥ గంగాసరస్వతిగవిరియు నేడే అమ్మగారువీరూ- సంతోషించుము సంతోషించుము చాలగానునీవూ॥ సదశివ॥ సంగమస్థానముపొంగిపారునెచాలగానుయపుడూ - గంగనుగడిచే యుపాయమెతుకుము ఘట్టిగానుయిపుడూ॥సదశివ॥ ఆశగలిగినిన్నేమిఅయినసూ అడగబోవునుగంగా- అడిగినమాటకు అడ్డముజెప్పక తెంపుజేయుమింకా॥ సదశివ॥ అకట॥ సుగిణివారిదరిశనంకొరకు మహామవునులుఅందరూ బహుగాకష్టించినారు- గంగాయమన సరస్వతియనే సరస్సులుమూడుగడువలేక వాటెనుదాటను సాధ్యపడక మనస్సునిలువక వీటెనుగడవడానకు మనవల్లగాదని కొందరు మనప్రాప్తంయింతేవున్నదని గురుభక్తిదప్పి దారీషణధనీషణ పుత్రీషణ అనె యీషణత్రయాలలోమునిగియున్నారు భవవార్ధిగడువలేకజ్ఞానస్వరూపిణి- సుగిణి-యీఅగణితంబైన మహాత్రివేణి యెందునచిద్విలాసం వారిదరిశనం చూడడానకు నీభాగ్యమేమందు నీపూర్వజన్మఫలంమంచిది తప్పదు సుగిణి॥

త్రిపుట.

వారెచెలియ అమ్మగారు గంగస్త్రానము జేయుచుందురు- గంగసరస్వతిగవిరి యనియేటీగరితలెపుడూ॥ ౧౬౬॥ అకటరో ఆగరితలిపుడు కలశికూడే సొబగుదెలుపుమూ - వేగదెలుపుము జాగుశాయకా కలశినట్లూ॥ ౧౬౭॥ కలికిరోఆకన్నతల్లుల కాలిధూళినసుమనీవూ - శరణుజొచ్చిమరుగుజేరికలయవమ్మా॥ ౧౬౮॥ అకటపలికినపలుకులకుచెలి నందభావమునొంది

ఆత్మలో- శరణుజొచ్చి మరుగుజేరెను మమతతోనూ॥ ౧౯॥ శరణుజొచ్చి మరుగుజేరిన చెలియనంతటజూచివారలు- యవ్వరమ్మానీవుయివుడూయవరుయవరూ॥ ౨౦॥ సరస్వతి॥

జంపె.

యీయోగకాంతెవరో యీతపళి యీపత్ని- జ్ఞానలీలలు ముఖమునాడుచున్నాయీ॥ దేహామునుశుష్కించి దేవభక్తియుమించి - పరవశత్వమునుండె పడతియవరనుచూ॥ గురుకరుణె నిత్యంబు గురుకరుణె సత్యంబు- గురుచర్యలిట్లుండు గురుపుత్రులకునూ॥ అనియిట్లుసరస్వతిఆత్మలోవూహించి- యవరమ్మనీవుయావురు యవరనుచూ॥ పన్నీరునటుదెచ్చి పడతిమొఘమునజల్లి- లేయవమ్మనీవుయావరో తెలుపవమ్మా॥

సరస్వతి॥ యవరమ్మానీవు- యవరు మార్గాయసముగయున్నావే- యవరునీవు యిచటికి యట్లొవొచ్చినావు నీనామధేయంబేమి॥ గవిరి॥ సరస్వతీ యవరమ్మవారు॥ సరస్వతి॥ యవరోనమ్మ నాకుతెలియదూ॥ గంగ॥ గవిరీ యవరకూడ గవిరి యవరోనమ్మా సరస్వతి నాకుతెలియదంటుందీ॥ గంగ॥ యీత్రివేణికి వొచ్చేవారందరు మహానియమూర్తులెనమ్మా అయితే సకుర్తు నూటికొకరూరు కోటికొకరూరు అందరురావడానకు శెక్యపడదులే॥ గవిరి॥ అట్లేమంమా కొందరుమహానియ్యులు రావడమేమి కొందరురాలేకపోవడమేమీ॥ గంగ॥ గుహుపుత్రులై గురువుపదేశం పొందినప్పటికిన్నీ భవాధ్దిగడచి నన్నుగడచి మోక్షానకు పోవడానకు కష్టతరమై రాలేరమ్మా కొందరు॥ గవిరి॥ యేమమ్మఆప్రాప్తంవారలకు గురుపుత్రులై పరమపదము జెందకుండా పోవడానకు వారిసంచితము॥ గంగ॥ గవిరీ॥ ఆసంఖ్యనీకు తెలియదులే ఆమరుగు గురువులవుపదేశము వారినోముఫలము అట్లుండును యవరుయవరని విశదముగా మనమట్లు అడగకూడదమ్మా॥ సరస్వతి గంగామనము అట్లుఅడగకూడదని అంటివి సరే అట్లుఅడగకపోతె యవరని మరియాదశాయవలెనమ్మవారినీ॥ గవిరి॥ నీమాటసరేనమ్మ సరస్వతీ॥ మేమునీతోయెదురుగామాట్లాడితిమని నీ మనస్సుయందు కించవుంచక యవరైనది అడగవలశినదేనమ్మా మహాదేవి॥ సరస్వతి॥ యవరమ్మా నీవు యేమిజప్పక అట్లున్నావు చెప్పవమ్మా త్వరగా నీగురుచెరితంనీనామధేయం మాదరిశనం యేవిధముచాత చేసుకున్నావో మాతోకలిశి మాట్లాడవమ్మ జాగ్రతగా॥

జంపె.

అనియిట్లు సరస్వతీఅడిగినను ఆయోగి- అడలుకొనుచును దండము బెట్టిపలికెన॥ గురుముఖంబున గురుతుమంత్రమునుగైకొని-యోగమందున మిమ్ముపొడగంటితల్లి॥ వేడుకతో నాపేరు యోగగుమ్మంటినీ - సందేహ మేమమ్మసరస్వతీదేవి॥

త్రిపుట.

అనుచుబలికియు వారలతోచెలి అడలుకొనుచును దండమిడుచునూ- పరమగురువుల పాదశేవకీ-నమ్మా నేనూ॥౧౭౧॥ అడలుకుంటివి దండమం టివి పరమగురువులసేవనంటివీ-ప్రేమమీరగ బలికితివినీపేరుయేమీ॥ ౧౭౨॥ గురుముఖంబున గురుతుగైకొని యోగమందున మిమ్ముకనుగొని-వున్నదా నను నాదుపేరు యోగగుమ్మా॥ ౧౭౩॥ అమ్మరో మనపుణ్యమేమో-యో గగుమ్మను చూడనాయను - సాధునామూ పుణ్యదరిశనా మాయనమ్మా॥ ౧౭౪॥ సరస్వతి. గంగా యీప్రొద్దు లేచినవేళ మంచిదమ్మా శుభము. మనపుణ్యమేమందు యీయోగగుమ్మను యీమహాతపసినీ చూడగలిగె సాధు నాం పుణ్యదరిశనం ఆయెగదమ్మా. భవాని॥ అవును యీప్రొద్దటి దివసం సుదివసం. ఇట్టివారిని చూస్తెనెగదా మనకు పుణ్యము లభించబొయ్యేది. భూలోకముగడిచి యిట్టిమహానీయులు వొచ్చేదే సకృతు. మనము వరి యీడచేయవలసినది యొకటి, నీకు తెలియనిది యేమున్నది.

త్రిపుట.

అనుచుబలికిన అమ్మగారికి శరణుజేసి చెలియఅపుడూ - గురుణి మంత్రము పఠనజేయుచూ గురుతునుండెన॥౧౭౫॥ వున్నచెలియను జూచి వారలు సొమ్మసిల్లి అమ్మరమ్మనీ- పొంగిస్నానముజేయుమనిరీ గంగలోనూ॥ ౧౭౬॥ అక్కరో- ఆగవిరిసరస్వతి గంగస్నానముజేయుమనిరి- యెటులజేతు నో యెరుకపరుచుముయోగమందూ॥ ౧౭౭॥ చెల్లెలు॥ అక్క॥ గవిరి సరస్వతి అనే అమ్మగారు గంగస్నానముజేయుమన్నారు యెటుఅశాయ వలెనో చెప్పవమ్మా అక్కగారూ॥ అక్క॥ జ్ఞానస్వరూపిణి నీకు గాయి త్రిమంత్రము తెలుసుగదా॥ చెల్లెలు॥ తెలుసునమ్మా మహాదేవి అయితే గాయిత్రిమంత్రములు శానాయున్నవి గురుతు యేమంత్రము అనిచెప్ప వలెనమ్మా అక్కగారూ॥ అక్క॥ అయితె అట్లనా యిరువైవక్కయు ఆర్నూరు రాత్రింబగటి జపించుచున్న హంసతారకము అనే గాయత్రి

మహామంత్రము తెలుసునా॥ చెల్లెలు॥ తెలుసునమ్మా అదేముఖ్యత గురువు తెలియజేసినది అక్క-గారూ॥ అక్క-॥ ఆహా అద్భుతాకారమైన వాస్తువే॥ సుగుణీ॥ అదేబ్రహ్మోపదేశము అదేకారణాకార్యాయలకుసామ్మ ఆమంత్రము జపించుచు గంగలోస్నానముశాయవమ్మా యేమిఅంటె యీ మంత్రధ్యానముచేయక స్నానముజేయబోతె గంగముంచునో యేమోనని తాత్పర్యము. భయములేదుగానీ స్నానముజేయవమ్మా॥ సుగిణీ॥ చెల్లెలు॥ చిత్తం॥ అట్లాగచేసెద భయములేదుగద॥ అక్క-॥ యేమి భయములేదుగాని సూర్యకళబారుచున్నదా, పారుచున్నది. అట్లయితె జాగ్రతగా స్నానముజేయుమంత్రము యేమారేవు॥

త్రిపుట.

చెలియరో గాయిత్రిమంత్రము జపముజేయుచు మునిగితేలుచూ - పొంగిస్నానము జేయవమ్మా గంగలోనూ - అక్క-మాటలు ఆత్మగైగొని జపముజేయుచు మునిగితేలుచు పొంగిస్నానము జేయుచుండెను గంగలో॥ ౧౭౯॥ పొంగిస్నానము జేయుచుండిన పొలతినాప్పుడుచూచి గంగయూ-యేమియిచ్చితివమ్మ నాకూయోగగుమ్మా॥ ౧౮౦॥ పొంగిస్నానముజేయుచుండిన పొలతిఅపుడు పోలోపోలియని కారుదున్నను బలియుబెట్టెనూ గంగకపుడూ॥ ౧౮౧॥ గంగస్నానముజేసి నిలచిన గరితకాపుడు గవిరి సరస్వతీ- వేటక-లలరగ వస్త్రాభరణమూలిచ్చిరపుడూ॥ ౧౮౨॥ మంచిగంధము పునుగుజవ్వాజి మల్లెసరులు చామంతిదండలు-వేసినలదిరి పునుగుజవ్వాజీవేడ్క-మీరగ॥ ౧౮౩॥ పూబోణులు పీటెమీటుచూ పూలశేషలు పైన జల్లుచూ- కోలహాలముజేసిగే కొల్లాటమందూ॥ ౧౮౪॥ కోలహాలముజేసి నాట్టి అమ్మగారికి శరణుజేశీ-సెలవులిమ్మని అడిగవేగమే యోగగుమ్మా॥ ౧౮౫॥ సెలవులడగను యోగగుమ్మా యెందుబోనే పసిడిబొమ్మా - యించేయుండవే ముద్దుగుమ్మా యిటులజేతుగ॥ ౧౮౬॥ యిందే యుండాను యిటులజేయను అందవలసిన పదవియున్నదే - అందవలెనే మూర్తికాంతసూ పొందవలెనే॥ ౧౮౭॥ అనుచు బలికిన చెలియ పలుకుల కాత్మలోఆరుదందివారలు-చేయదగిన చిద్విలాసమూ జేసిరపుడూ॥ ౧౮౮॥ ఛత్రచామర ఆలవాట్టాద్వయములూ పైబెట్టి అప్పుడూ - వేసిరమ్మా యోగగుమ్మాకు వింజామరలూ॥ ౧౮౯॥ పంచవిధముల వెలుగు చుండే పగులు వాత్తులుదీటి బాప్పుడూ వేటక-మీరగ యోగగుమ్మకూ పట్టిరపుడూ॥ ౧౯౦॥ సన్నమేల

ము కూచిజేయుచు సకియలందరు పాటపాడుచూ- మమతతో మత్తేభవం బునూ తెచ్చిరపుడూ॥ ౧౯౧॥ మత్తగజముపైన యోగమున్నను గూర్చుం డబెట్టి-గంగసరస్వతి వేడ్కజూచిరీ సంగమందూ॥ ౧౯౨॥ గజముపైన యోగమున్నా కొలువుదీరీ పసిడిబొమ్మా గురుణిమంత్రము పఠనజేయు చూ గురుతునుండెనూ॥ ౧౯౩॥ పంచకన్నెలు పళ్ళెరంబుల జోతులూ ముట్టించుకోనీ-వేడ్కతో ముత్యాలశేషలు చల్లిరపుడూ॥ ౧౯౪॥ పుణ్య స్త్రీలు పుణ్యమతులూ వన్నెమీరిన సన్నుతాంగులూ - సన్నజాజులు చల్లి జయమనీ పలికిరపుడూ॥ ౧౯౫॥ వేణుభేరీవీణతాళమూ ప్రణవభేరీ పంచ ధ్వనులతో-కంచున ఖరాకూచిజేయుచూ కదలిరపుడూ॥ ౧౯౬॥ కదలివా రలు వీధికొచ్చే సమయమందున గరుడగంధర్వ - యక్షఖేచరుల్ నాట్య మాడిరి నందముగనూ॥ ౧౯౭॥ పుణ్యమతులూ పుణ్యస్త్రీలూ వీధివీధులు తిరిగేటప్పుడూ-పూల శేషలు పైనజల్లిరీ పుణ్యవతికీ॥ ౧౯౮॥ పుణ్యవతి యూ వీధిరంగ బాగుగా బాజారుకొచ్చి-రాజబాటలో నిలచనే కడురమ్య ముగనూ॥ ౧౯౯॥ పాటలు. ఇట్లు నిలచిన యోగమునకు గవిరీ సరస్వ తి గంగఅనేఅమ్మగారు మంగళహారతియివ్వను యత్నంబుజేసిరట యెటు వలెను॥ సరస్వతి॥ గవిరీ యేమమ్మా సరస్వతీ॥ సరస్వతి కనకకలిశము తో యుదకము తీసుకొని పచ్చలపళ్ళెరములో పసుపుకలక జేసుకొని తీసుక రావమ్మా జాగ్రతగా॥ గౌరి॥ సరస్వతి పసుపులేదుగదమ్మా॥ సరస్వతి॥ లేకుంటె గంగను అడుగు గవిరి గంగా పసుపటు॥ గంగ॥ పసుపు సంగతి నాకేమి తెలుసునన్నడగను॥ గవిరి॥ గంగ నాకు తెలియదంటుందిగదమ్మా సరస్వతి॥ సరస్వతి॥ యెందుకు తెలియదంట వకటదున్నపోతునంత ... మత్తుచేత తెలియదేమో బాగాచూడమను॥ గవిరి॥ పసుపునీకు తెలుసు... టిగదమ్మా భవానీ॥ గంగ॥ తెలుసునమ్మా నాచేపొరపాటు మొన్ననా చేతికి ఆమే యిచ్చియుండెను. వాస్తవమే నేను ముత్యాలగద్దెకింద పెట్టి వుంటి యిదోనమ్మా॥ గవిరి॥ అప్పుడేయిస్తే బాగాయుండునే భవానీ॥ గంగ॥ అప్పుడే యిస్తే యీమాటలు యెక్కడవొచ్చు॥ గవిరి॥ యేమిమా టలు లేదులే ఆమహాదేవి అన్నటువంటిమాటలకు మనమువస్సున కించవుంచ కూడదు మనతప్పులు మనపొరపాట్లు శానావుంటూవున్నవి. ఆమెఅనకూడ దా మనము పడకూడదా॥ సరస్వతి॥ గవిరీ ఆలశ్యంచేస్తిరేమి॥ గవిరి॥ యేమి ఆలశ్యంలేదు తెస్తిమితెస్తిమమ్మా॥ సరస్వతి॥ కనకకలశముపైన

పచ్చలపళ్లెరంబెట్టి పసపుకలకశావమ్మా గవిరీ॥ గవిరి చేశినానమ్మ మహా దేవి॥ సరస్వతి॥ గవిరీ యేమమ్మ మహాదేవి భవానినీవుయోగగుమ్మకు క్రమముగా మంగళహారతియివ్వరమ్మా॥ గవిరీఅట్లాగెయిచ్చెదమమ్మా సరస్వతీ॥

యోగగుమ్మకు మంగళహారతిచ్చుట.

మంగళహారతి - శుద్ధసావేరి.

జయమంగళంనిత్యశుభమంగళం - జయా జయమంగళం సదాశుభ మంగళం॥ మంగళముమంగళముమనయోగగుమ్మకూ- మంగళముమముగన్న మానవతికీ- మంగళముభక్తికి మంగళముశక్తికీ- మంగళము ముక్తికీ మహా దేవికీ॥ జయ॥ గురుకరుణచాతనూ గురుతుమదినిలుపుకొని- యోగమునభావమున యెరుకతోనూ- ఆలశించక అయిదుస్త్థానంబులనుదాటి- ఆరింటి కొచ్చినా అమ్మకిపుడూ॥ జయమం॥ ప్రణవపీఠమునందు ప్రేమతోనీభక్తి కొని యాడుచుందుము కొల్లలుగనూ- మల్లెపూవులతావి మరువంపుపూమోవి- సద్గుణశాలైనసత్యవతికీ॥ జయ॥ ప్రణవభేరీమృదాపంచమహాధ్వనులచే- వీధి వీధులుదిరిగి విశదముగనూ- రాజబాజారుకుకడురమ్యముగవొచ్చి అలశినిలచినయోగగుమ్మకిపుడూ॥ జయ॥ జయమంగళము నిత్యశుభమంగళం॥

వచనము॥ అనియిట్లు హారతిచ్చిన పిమ్మట యోగగుమ్మ గజముదిగి నిలిచి నమస్కరించి అమ్మగారిని శలవుఅడిగెనట యెటువలెనూ॥

తోహరా॥ అమ్మామీరక ఆలశించకను ఆజ్ఞ యివ్వవలెనూ - త్వరగాబోయ్యాతోయజాక్షిని కనులజూడవలెనూ- కాంతామణికి శరణుజేస్తేనే అమృతమడుగవలెనూ - అడిగిన మాటకు జవాబుజెప్పి అచ్చట నిలువవలెనూ॥

కురుచ జంపె.

యెరుకకలిగిన యోగగుమ్మా నీవుయింతచక్కని దానవమ్మా॥ దిద్ది తీర్చినబొమ్మవమ్మా నేనుయేమనందునెఅజునికొమ్మా- యంతసుకృతముజేశినావో నీవుయేగురుణికరుణబొందినవో- త్రివేణి స్నానంబుశాయం చెలియ నీవుజేశిన యెట్టిపూజా- యిచ్చట నీవుండినాకొమ్మా మాకుప్రొద్దుబోవునేముద్దుగుమ్మా॥ సరస్వతి॥ యెక్కడికి పోవలెనమ్మ యోగగుమ్మా శలవడిగితివి యిక్కడనేవుండరాదూ నిత్యము యీలాగె నీకుమహోత్సవములుజేసెదము వుండవమ్మా॥ యోగగుమ్మ॥ తమతొమనవిచేసుకుంటినె ముక్తీకాంత దరిశనానికి పోవలెనని అమ్మాశరణార్థిగైకొని త్వరగా శలవిచ్చి

పంపరమ్మా యిపుడుమీరుచేశిన మరియాద ~~శ్రీకాంతా~~ నాకమితమైతోచు చున్నది యింతెచాలు సంతోషముచాత అభయమిచ్చిపంపమని నమస్కరించెను॥ గవిరి॥ అమ్మాసరస్వతీ యోగగుమ్మ ప్రయోగమువేరేయున్నది ము క్తికాంతదరిశనానికి పోవలెవనే గమనంవకటివున్నది మనము నిలువమనిచెప్పిప్రయోజనములేదు యీమెకువకరువన మహాత్యంబు జూపుదామమ్మ సరస్వతీ॥ అవునమ్మాగవిరీ మంచిజ్ఞాపకముచేశితివి॥ సరస్వతిఅమ్మాయోగగుమ్మా అట్లాగెపోదువుకానీ నీకొకవనమహాత్యముజూపెదచూడవమ్మా॥ యోగగుమ్మ॥ అట్లాగెచూచెద చూపవమ్మా మహాదేవి॥ గవిరి॥ సరస్వతి॥

యోగగుమ్మకు వనమహాత్యము జూపుట.

**తత్వము - దరువు - శంకరాభరణము - రూపకము.**

చూడవమ్మ చూడుమిపుడూ- శృంగారవనమూ- చూడవమ్మ చూడుమిపుడూ॥ చూడవామ్మవేడుకాతో శృంగారవనముమహత్య - యింపుల లరసొంపుగాను పెంపుమీరియున్న సొబగూ॥ చూడ॥ ౧॥ అనుచువారు వనముకేతెంచీ- వేడూకలలరా- చూడగానువనములోమంచీ- గుజ్జుమామిళ్ళు నిమ్మనేరెల్లు- మంచిమారెళ్లు సన్నజాజులు- వొప్పియున్నవనమువేడుకా॥ చూడవమ్మా॥ చూ॥ చూడవామ్మచూడుమిపుడూ- చిత్రములివియుచూడవామ్మ చూడుమిపుడూ- చూడవమ్మ చూడుమిపుడూ శృంగార వనములోనా- కలికిచిలుకలుహంసగమనలు పలుకులుమధు లొలుకుచున్నవి॥ చూడ॥ శృంగార వనముజూడగా- చిత్రాములన్నీ ఆత్మలో సంతోష మాయగా- శృంగారవనముయిపుడూ చూడగానువనములోనా- సన్నజాజులు సంపంగిపూవ్వులూ- విరిజాజిమొగ్గలు వికశించియున్నావి॥ చూడ॥ ౨॥ అట్టివనముతిరిగిచూడగా- ఆవనములోనా- సొంకమైనాకొలనుయుండెగా - కొలనుదగ్గెరికొచ్చివారు తొంగిచూచిసంతోషించీ - యిట్టికొలను వనముజూడ నీదుపుణ్యామేమనందూ॥ చూడ॥ ౩॥ శృంగారవనముతూర్పునా- వేడుకలలరా- చూడవమ్మా నీవునేర్పునా - తూర్పుదికుకు నేర్పుతోనా చూడవమ్మ కొండమ తుమ్మెద - రోదనలకు పన్నగములూ పణముఎత్తి ఆడు చున్నవి॥ చూడ॥ ౪॥ కొలనులోన వున్నమహాత్యము- శ్రద్ధాముగానూ - చూడవమ్మ యిపుడుచిత్రామూ- కోడెతాబేళ్లుబేడిసమిలు- తోరహంసలు కొమరువెంబడి- ఆటలాడితామెరతూండ్లు భక్షణములుజేయుచున్నవి॥ చూడ॥ ౫॥ వనములోన యున్నమహాత్యమూ- యీచిత్రమూలూ- మనములోన జూచినీ

త్యమూ- వుంటివైనగంగయపల్లె నాలికాత్సుడైనహరుడూ - గురుడుమజూ చినిన్నుమెచ్చి కైలసంబియిచ్చువాచ్చి॥ చూడవమ్మాచూడుమిపుడూ॥౮॥

రేగుప్తి - ఆటతాళము.

వినవే యోగగుమ్మా విశదాముగానూ - యింకా యీవనమాహాత్మ్యావివరింతుయేనూ- శృంగరంపూ వనముపరమట- బంగరంపు భావిలోనా- రంగుమీరగదేవకన్యలు పొంగిస్నానముజేయుచుందురూ॥ వినవె॥ ౧॥ శ్రీరత్నమావిను యీనేతావనమూలో - చూచేటివారికి ప్రీతిమనమూలో- చూడసుందరమైన మంచీకలికి చిలుకలుహంసగమనలు- ఆటలాడుచు పాటపాడుచు ఆలరుచున్నవి వనములోనా॥విన॥ ౨॥ వినవేయోగగుమ్మా వనమహాత్యమిప్పుడూ- చూచీనావేడుకాచూచుచుండెపుడూ - చూచుచుండిన సురులు మునులు దేవతలు నవకోటిసిద్ధులు - పాయకనునీవు జూచినప్పుడె దాయకవారు దరిశనిత్తురూ॥ వినవెయోగగుమ్మా॥ యోగగుమ్మ॥ యిట్లు చెప్పుచున్న సరస్వతికి నమస్కరించి- యీవనమహాత్యము దుదముట్టచూడ జానకు తెడువాతూయున్నది యిపుడే శానాతడువైయున్నది - మీదయయుంటె యెప్పుడైనాచూడవచ్చు-నాకిపుడు శలవిచ్చి పంపరమ్మా అయితె యింకొకకోటి-నీతోమనవి - యెంతమహాత్యంబుబూపినా - పోదామనె గమనమెయున్నదని-మీమనస్సుయందు కించవుంచక- పంపవమ్మ-మహాదేవీ-శరణు॥ సరస్వతి॥ యోగగుమ్మా- అట్లాగెపోదువుగాని - యీవనములో శృంగారమహల్వకటెయున్నది- చూచిపోదువురావమ్మా - మహాలుకుపోదాము- మహారహశ్య స్తానం॥ యోగగుమ్మ॥ అట్లాగెపోదాము పదవమ్మ వాశ్చెద- మహాదేవీ॥

ఏకతాళం.

ఓంకారంబునపుట్టినరవములూ- చెవులనునాటినానందమునొందెం- సంపంగిపూవ్వుము సన్నాపిరజాజులా- తావియాఘ్రాణించి సంతోషమొందెం॥ పొన్నలు పొగడలు పున్నాగవృక్షమూ- లాచెలిజూచియాహాశ్చర్యమొందవేఁ- శుకపికరవములూ కోవెలపలుకులూ - వినియాచెలిమదీచల్లానొందెఁ- గురువారి కరుణతో యిన్నియుజూచితీ - అనియిట్లు ఆత్మలో గురుని దలంచాఁ॥ తల్లియు దండ్రియూ దైవముగురుడికా - యేరొండు లేదనీ వాకుకనబొగడేఁ॥ అనియిట్లు మనంబున వితరిగించి యోగగుమ్మ మహాల్చూచి సంతోషపడుట- అహాహా యెంత శృంగారమైన మహాల్

లమ్మా సరస్వతీ వనముకుదగిన మహలు. మహలుకుదగిన వనము. పూల తోటలు వొప్పియున్నవిగదవమ్మ మహాదేవీ॥ సరస్వతి॥ అమ్మా యోగ గుమ్మా॥ యోగగుమ్మ॥ యేమమ్మశారదా॥ సరస్వతి॥ అమ్మా పూవన్ని చూచితివి ఆత్మలో సంతోషపడితివి అమ్మా తమవైనది సెలవిచ్చిపంపమని అడిగితివి, యీవనము కంటె పూ సుందరమైన మహలుకంటె యీపూల తోటకంటె యీత్రివేణికంటె మాకంటె విశేషమేమున్నదీ యింతకంటె మోక్షమున్నదే యోగగుమ్మా పోతాపోతానంటావు, యిక్కడనెయుండ వమ్మా॥ యోగగుమ్మ॥ అమ్మా సరస్వతీ శరణార్థి యిక్కడనె యుండ డానకు యుండవొచ్చుగాని, నాయోగము సైయ్యామయోగము తుదముట్ట చూడవలె, దీనికొరత పెట్టకూడదు. సైయ్యామయోగానకు ముఖ్యత ముక్తి కాంతదరిశనానకు పోవలెనమ్మా మహాదేవీ॥ సరస్వతీశరణు గౌరమ్మాశర ణు భవానీశరణు యింక సెలవుదయచేయరమ్మా నామీదదయయుంచీ సర స్వతి॥ అట్లాగెనమ్మా అగత్యం అగత్యం॥

త్రిపుట.

అనుచు బలికాయమ్మగారూ అభయమిచ్చీ- సెలవులిచ్చి అదియె పోమ్మామూక్తి-ద్వారముయోగగుమ్మా॥ ౨౦౦॥ అనుచుబలికీ వారలాప్పు డూ యోగగుమ్మనుసాగనిడచీ- యోగగుమ్మతో వేడ్కమీరగా అమ్మగారూ॥ సరస్వతి॥ ౨౦౧॥ యోగగుమ్మా నీవుత్రివేణి స్నానానికివొచ్చినపుడు స్నా నంచేసి నీవు అట్లనే పోకమ్మా మాకుదరిశనంయిచ్చిపోవమ్మా॥ యోగగుమ్మ॥ అట్లాగెనమ్మా మీదరిశనానికి రానిది నేస్నానానికి పొయ్యేదిమేముంది త్రివే ణికి॥ పోయివస్తానమ్మా సరస్వతీ పా॥ అమ్మా పా॥ మామీదజ్ఞాపకముంచు చిత్తం.

త్రిపుట॥ వొచ్చివారలు పకరికొకరూ ప్రేమమీరగ ఆమె చరితమూ ఆడుకొనిరీ ప్రణవమందునా ప్రేమతోనూ॥ ౨౦౨॥ యోగగుమ్మా యెం తదమ్మా యెందుబోయిన పదవెనమ్మా- అందవలసిన పదవివేగమె అందగల దే॥ ౨౦౩॥ అనుచుబలికీ వారలాపుడూ అంతటుండగయోగగుమ్మా- యో గమాందునచూచి అక్కతో- పలికెయేమో॥ ౨౦౪॥

షష్టమస్కంధము - సంపూర్ణము.

త్రిపుటం.

అక్కరో యీప్రణవపీఠమునందుయుండిన చరితజూచితీ- అందు పైగాచూడ మహాద్వారమేమి॥ తం॥ అక్క॥ సుగిణీ॥ త్రివేణి చూచితివే-చూచితి- గంగస్నానముజేసితివే- చేసితీ- గంగనుగడిచితివే- గడిచితీ- త్రివేణియందున్న చిద్విలాసం నాకేమిచెప్పలేదే సుగిణీ॥ చెల్లెలు॥ చిత్తం చెప్పెదనమ్మా జరుగుసంగతులు అక్కగారు॥

ద్విపద.

శ్రీమించు త్రివేణిసంగమందున్న మాహాత్మ్యంబుచూడగా చిత్రమై తోచె। గంగయు సరస్వతి గవిరిమహాదేవి। వారుచేసిన యుపచారంబు నీకు। చెప్పెదవినవమ్మ చెన్నుమీరగను। త్రివేణిలోమునిగి స్నానంబుచేసి। గట్టుకురమ్మనిన గ్రక్కనవొచ్చి నిలచున్న పుష్పహారములు మెడవేసి పట్టుచీరయుదెచ్చి కట్టుకోమనుచూ। పునుగు జవ్వాజి దెచ్చి మేనంటినలది కర్పూరహారతి క్రమముగాదెచ్చి। పంచారతీదెచ్చి పాటలుబాడీ। వున్న వారినిజూచి శరణార్తిజేసి సెలవులిమ్మనిన యాసరస్వతీదేవి। యక్కడికి పోవమ్మ సెలవులడిగితివి। అని యిట్లుఅడిగిన ఆమహాదేవి। అమ్మరో నే మూర్తికాంతను జూడబోయెదనన్నయా। గవిరి సరస్వతియు। వుచ్చాహామునుజేయ యత్నంబుజేసి। కిన్నరకింపురుష గరుడగంధర్వ యక్షఖేచరుల్ నాట్యముజేయుచుండ। ప్రణవభేరీ మొదల్ కంచునఖార। ములు గొట్ట గోళ్లనా ఘోరుగొల్పుచునూ। మద్దెలతాళములు వాయించువారు। ముత్యాలగొడుగులు ముందరబట్టి। ముత్యాలశాసలు జల్లెటివారూ। గజముపై యెక్కించి ఘనతమీరంగా। వీధివీధులను యుత్సవముజేయువారు। వీధులశృంగార మింతనిజప్ప। అలివియేవిష్ణుకు। అలివెరుద్రునికి। అలివియే బ్రహ్మకూ। దేవేంద్రుకైనా। అలివియె యతులకు అలివె యోగులకు। అలివియేమానులకు అలివౌనటమ్మా। సైయ్యమయోగంబు సాధించి యేను చూచినవాస్తువ తోచినంతయును చెప్పెదవినవమ్మ చెన్నుమీరగను। నాటకశాలలు నయమొప్పమీర మొగసాలనగరులు శృంగారమేడలునూ। చక్కని పొదరింట్లు మక్కువలలర। రమ్యమాపూగుదులు రాజాస్యవినమూ। పొన్నలుపొగడలు పోకమాకులును, పొంకమా బావులు మృదువుతాబేళ్ళు। పగడంపుతీగెలు పారుజాతములూ। విరులును చామంచి విరులపుష్పములూ। తెల్లకలువలు సంపంగిపువ్వులునూ। మల్లెలు మొల్లలు మరి

జాజిపూలు । దేవతాపత్రియు దేవగన్నేరలు । వొప్పియుండిన యట్టి త్రివేణిజూచి । ఆనందమునుబొంది అమ్మరోనేను । వారినిశలవడిగివొచ్చు సమయాన । శృంగారవనమొకటి చూచిపోవమ్మ । అనిచెప్పివారలు అతి శీఘ్రముగనూ । గంగయు సరస్వతీగవిరి మహాదేవి । నన్నుతోటూని వారు వనముకేతెంచీ । చూడమనిచెప్పిన జూచితినేను । వనము శృంగారంబు వైభవమంత । కన్నులపండుగా కలయజూచితినీ । చూచి సంతోషించి వారికిమ్రొక్కి సెలవడగ వారలు అభయంబులిచ్చి అదిమో పొమ్మ ముక్తిద్వారమటనిరీ॥

వచనం. అనియిట్లు పలికిన చెలియపలుకులకు అక్క ఆనందభరితురాలై ఆచెలితో యిట్లనియె.

తత్వము - మధ్యమావతి - ఆది.

వినవేసుగిణి దెలిపెదా- యిపుడొక్కమాటా వివరించినీకు జెప్పెదా - అగణితముగ గురుమరుగు దెలియ మంచిసుగుణులకేగాని యితరుల కలివె॥ వినవే॥ గురువూలాగురుతుదెలశీనా । తెలశీనాకలశీ పరమాహంసాలబట్టీనా । మోహభ్రాంతులని మోసముజేసునూ - భ్రాంతుల చీకక్క క మోసపోకయుంథూ॥ వినవే॥ ౨॥ అందావాలాసిన పదవీనీ శీఘ్రముగానే అందిపొందితి ఆత్మలో॥ సందిదెలియకను అందదుయవరికీ- హరిహర బ్రహ్మసురపతికైనను॥ వినవే॥౩॥ ప్రాయామూనిలువబోదూమాయా- సుగీణి నీకాయామూలోనజూడుసాయా - వేడుకలరనీవూ మెక్కిపోయి- నిక్కీ హేమతారకాబ్రహ్మనుకలిశుండూ॥ వినవే॥ ౪॥ సద్గూరూస్వామి కృపచేయిపుడూ - గంగాయాపల్లెహారునీ దలుచూచుమదిలో నెపుడూ - జాడదెలసీ మంచిమేడజేరినీవూ - ఆనందపదవిలో అడుచునుండుమూ॥ వినవే॥ సూగిణి తెలిపెదా॥౫॥

కందార్థములు॥ హంసతారకమంత్రంబు - నాత్మనుడివీ - అందు దెలసియు సయ్యామున్ చిందలిడచి - కాలఖర్మంబుననెదాని కాల్చివైచి - వాలాయముతో చాలామేలునుందురుగా - యెప్పటికీ చెడిపోనీదందురుగా॥ సందేహమునుమాని సర్వాముకనుగొనీ - సయ్యామయోగులు నెయ్యాముతోదానీ - విడువకెప్పుడు యింటిలోపల జంటనాగుల అంటివ్రాదుచు - కంటిలోపల వొంటిదెలసి మింటజూతురు రొంటిదానీ- మేలునుందురుగా- యెప్పటికి చెడిపోనిదందురుగా॥ కంకాళు ధర్మమార్గము- కారణమది చూ

డలేకా కానకతమలో - వాసిగ ఆసనమేసుక - తారకమాని తరిచీవారు తల్లడించిరిగా - యెన్నోనాళ్ళు తపసుజేసిరిగా॥ గొండా గృహాలలోన దండిగా కూర్చోని అండాజవాహనుసీ అంతుదెలియలేకా - చింతజేసిరి అంతుగానక పరమహంసల పట్టుదెలియక - గురువుజెప్పిన గుట్టుగానక - హంసపగిది నలివిగాకా-తల్లాడించిరిగా- యెన్నోనాళ్ళు తపసుజేసిరిగా॥

త్రిపుట.

చెలియరో నీవుణ్యామేమె మహాద్వారముగాంటివిపుడూ - అందవల సిన పదవినీవిఘా అందితివిగా॥ ౨౦౬॥ అనుచు బలికిన అక్కాకును చెలిశర ణుజేశీ చెన్నుమీరగా - నీదుదయతో యింతపదవిని అందితినిగా॥ ౨౦౭॥ వినవె చెలియాకుందరదనా మందగమనా మధురవాణీ- అలరుచును ఆజ్ఞే యమదియే ద్వారమదియే॥ ౨౦౮॥ అక్కారో ఆజ్ఞేయమంటివి మహాద్వార ముఅదియెనంటివి- అన్నమాత్రమెకాదు తెలుపుమూ తిన్నగానూ॥ ౨౦౯॥ అదియెచెలియా విద్యుల్లేఖా అదియెనేసీవారశుభా- అగ్రమదియే నీలతోయ దామధ్యమదియే॥ ౨౧౦॥ అక్కా విద్యుల్లేఖయంటివి అదియెనంటివి వార శూభా- అగ్రమంటివి నీలతోయద మనగనేమీ॥ ౨౧౧॥

వచనము॥ ఆజ్ఞేయకమలనిర్ణయం వివరిస్తూయున్నాను.

త్రిపుట.

చెలియగో ఆజ్ఞేయమనియేటి కమలమందున రెండురేకులు। నధినా దము తాత్వభూతమూనహరియుండ్రూ॥ ౨౧౨॥ అక్కారో ఆకమలమందు న రెండురేకులు యుండునంటివీ- నధినాదముయుండునంటివి అనగయేమీ॥ ౨౧౩॥ చెలియరో ఆకమలమందున రెండురేకుల బీజలుండునూ॥ హం॥క్షం అని నాదముండును దశవిధంబులా నధిలోనూ॥ ౨౧౪॥ అక్కారో ఆనాద మిప్పూడు వినగబోతే కమలమాందున-ఘంటరవముగ బలుకుచుండే గర్జ నేమీ॥ ౨౧౫॥ చెలియరో మాణిక్యకాంతికీమరలుచుండిన మహాద్వారము॥

మంత్రం॥

ఓం హ్రాం హ్రీం హ్రూం సం ఆజ్ఞేయం నందుగాట్టిన ఘంటరవమదీ మోయుచుండూ॥ ౨౧౬॥ అక్కారో ఆఘంటరవమూ నంట జూడగబోతెయూప్పూడూ - నాతియవరోయున్నదమ్మా నాణ్యముగనూ॥

తోహర॥ హరహర శంభో యనుచూ ఆదిమంత్రమె తరుచూ - మరకతమాణిక్య నీలగోమేదిక పుష్యరాగములతో - వొప్పినద్వారము కడ్డ

మున్నదోక కాంతాతోరాతో॥ హరహర॥ కన్నులకలికీ మహాసుందరీ మహాత్యంచేమమ్మా - వాలుకన్నులూ జారుపైయెదావసరుగానుకోమ్మా హర॥ యెవ్వరునీవని పేరుఅడిగెనను వేటకమీరగానూ - పేరుజెప్పనేనిన గోరెదననె ప్రేమమీరగానూ॥ హర॥ యోగివా భోగివా త్యాగివా నాకు వెరుకపరచమనెనూ యోగముయేదో సావధానముగ సంధి దెలుపుమనెనూ॥ హరహర॥ చెల్లెలు॥ అకాట- అఘంటారవంచవుల పండువుగా వింటూ - దృకుటనిలిపీచూడగా - అకటడకానబడెదృశ్యం- మహద్వారమడ్డగించుకొని - నాతియువరోయున్నదమ్మ మహాసుందరీ॥

తోహర॥ చెలియా విను యిదిసింహద్వారము మహద్వారమమ్మా- ద్వారముకడ్డమునిలచియుండెదీ జారకాంతెకోమ్మా॥ హరహర॥ శంభో యనుడీ- ఆదిమంత్రమేగనుడీ॥ కరములుమూడ్చీ శరణుజేయుచూ కాంతకు నీవపుడూ - అడిగినమాటకు జబాబుజెప్పి ద్వారమువెడలిపుడూ॥ యతులుయోగులు మానులు మహాత్ములు యీద్వారమునందూ - కాంతకుజబాబుజప్పగలేకా చికుటపడిరియిందూ॥ హర॥ ముద్దుచెలియా ముక్తిద్వార ఏపుడెల్లా వెడలెదవో - అడిగినమాటకు జబాబునీవూ యేమనిజెప్పెదవో హరహరశంభోయనుడీ॥ అకట॥ జ్ఞానస్వరూపిణీ-సుగిణీ - ఆసుందరి రూపురేఖ సౌందర్యలావణ్యము యెట్టిదో చెప్పవమ్మా॥ గురుతు॥ యోగగుమ్మ॥ చిత్తం॥ అట్లాగె చెప్పెదనమ్మా సవధానముగా చిగురాకుపాదములు బిగువుపికటలతో అరిటిస్తంభముబోలు పెందొడలతో కిన్నెరబోలిన పిరుదులతో సన్నంఘనడుము వన్నెచీరతో నడుమువొడ్డ్యాణము మెరుగుగజ్జలతో వైయారిచూపు వలుదగుబ్బలతో అగణించుబాహులు మృదువైన హస్తములతో అర్ధచంద్రాకాంతిగల మోముతో చకటని నాశికము తళుకు చెకిటళ్ళతో పిల్లపిసరకాయలకు సమానమైన పెదవులతో ఆణిముత్యాలకుసరిమైన పలువరుసతో యింద్రనీలపు కురులు జడకుచ్చులతో మికుటమైన కంచుకము కలువరేకులుబోలిన కన్నులతో జారుపైయ్యెద చకటజేయుచూ చిరినవ్వునవ్వుతూ వాలుకన్నులచూస్తూ ఆభరణములు ధరియించుకొని యీమహద్వారముకు అడ్డగించుకున్న యీచకటని సుందరి యెవరు, నామనస్సు భ్రమిస్తుయున్నది యీమెచరితమేమి యీసుందరి నామధేయంబేమో త్వరగా తెలుపమని ప్రార్ధించెద॥ అకట॥ జ్ఞానస్వరూపిణీ సుగుణీ అగణితంబైన యీమహాద్వారమన్నచరితము తెలిపెదవిను॥

త్రిపుటం.

అదియేనమ్మా తాత్వభూతిము ద్వారమందున గాచియుంచునమ్మా-యోగపురుషులగోత్రసూత్రము లడుగుచుతూను॥ ౧౮॥ అక్కరో యీకమలమందున యున్నచరితము యింకయేమో - బాగ తెలుపుముజాగుశాయకా వేగవేగా॥ ౧౯॥ చెలియరో వినుగంగసరస్వతి సంగమునిటయేస్థానమందున- పదియునూర్లాహంసలైనదీ ఆడుచుండునూ॥ ౨౦॥ అక్క॥ జ్ఞానస్వరూపిణీ, సుగుణీ, యీసంగమందున దశశతహంసలు సదాశివునకె అర్పణ తత్వభూతంలోనే పుట్టునమ్మా సుగుణీ॥ చెలెలు॥

త్రిపుటం. అక్కరో ఆగ్నేయకమలము నందుయుండిన చెరిత చెలిశనూ- ద్వారమెటువలెవెడలవలెనో తెలుపవమ్మా॥ ౨౧॥ చెలియరో వినుగురుణినీష్టతో గురుమొఖంబునచూటిగ్గా కోనీ-చూడవమ్మాముక్తిద్వారమూ దాటవమ్మా॥ ౨౨॥ అక్కరో నేగురుణినీష్టతో గురుమొఖంబున చూడబోతే-యవరునీవని పేరుఅడిగెనూవెలదియెవరో॥ ౨౩॥ అదియేనమ్మా వారకాంతా వాకిలొద్దనేకావిలుండును - సాచ్చిపామ్యోయోగపురుషులా పేరు అడగక॥ ౨౪॥ అక్కరో నను పేరుఅడిగెనె యేమనందునో యెరుకపరుచుమూ - సరుకుశాయకచాప్పవమ్మా సవిఘ్నయేమో॥ ౨౫॥ చెలియరో నీవు భయముభక్తితో గోత్రసూత్రము పేరుజేప్పి - వెడలవమ్మా ముక్తిద్వారమూ వెడలువెడలూ॥ ౨౬॥ చెల్లెలు॥ అకాట శరణాగ్రి నాయెందు మీకరుణాకటాక్షం పూర్ణముగావుంచి దీవెనాభయమిచ్చిపంపవమ్మా-వెడలెదద్వారము మహాదేవీ॥ అక్క॥

క॥ మాశరణేబంగారము। మాశరణేదీవెనాగ్రి మహాత్యంబంతా।
మాశరణేజ్ఞానదీపము । మాశరణే వెరుకసొమ్ము మాగువాపామ్మా॥

వచనం॥ యోగసుమ్మ ముక్తిద్వారముచూచుట॥

త్రిపుటం.

చెలియరో నీవెవ్వరే నేపేరుఅడిగితెచాప్పకున్నవూ- చప్పవే నీగోత్రసూత్రము పేరుయేమో॥ ౨౭॥ యిన్నిమార్లుఅడిగితే నీవేమిజాప్పక యూరెకున్నవూ- జ్ఞానమదమూ విద్యగార్వమూ గరితెసీకూ॥ ౨౮॥ యోగివైతే భోగివైతే త్యాగివైతేఅయితిపిలే- పేరుజాప్పక ద్వారమెటువలె దాటెదావూ॥ ౨౯॥ జారకాంత॥ యెవరమ్మానీవెవరు నేనికడవుండగానె నన్నుకాదని అడ్డముదూరి అట్లుపోబోతావు- యెవరునీవు నీపేరుయేమి-

మహాద్వారముదాటి - పోవజాలకు - నీకంతస్వసంభ్రమా నీ వాక్యమే జేసు నమ్మా లేకపోతె ఆమె అక్కడవున్నదనే మాటయున్నను తేఁ పోయానే- మే యోగమునీది॥ యోగగుమ్మ॥ అమ్మా నీవెవ్వరైనది నాకు తెలియదు యి దివరలో నిన్నుచూడలేదు యిక్కడ నీవు ద్వారకర్తవైతివి నాకు తెలియక నేనుపోబోతి నీవు అదిరిపాటుగా మాట్లాడవద్దు యిక్కడ యెదిరేవారు యెవ్వరు లేరు ద్వారకర్తవు నీవుఅయివుండి శాంతము లేకపోతె యెటుల మ్మా తల్లీ, తురియపదవొద్దమ్మా యిన్నిస్థానములు దాటవాస్తి నీవలె గద్దించలేదమ్మా యెవరూ మాయోగము గొప్పది సైయ్యాటుయోగము॥ జారకాంత॥ యోగినీ నీయోగము సైయ్యానుయోగమంటివి నీగోత్రసూత్ర ముల పేరు జెప్పి చొచ్చుద్వారము నీవంటివారు, స్త్రీలు, పురుషులు, వేత్తల మని, యోగులమని, మానులమని, తపసులమని, తాగాతమ్యం తెలియక నే నడిగినప్రశ్నకు ప్రత్యుత్తరం చప్పజాలక యీ మహాద్వారము దాటలేక ఆమహాదేవుడైన సదాశివమూర్తిగారిని దరిసించజాలక ఆజగజ్జాలమనే భూలోకమందు సంసారవార్ధిలోమునిగి వెడలలేకయున్నారు, నీవుద్వార కర్తవైనందుకు శాంతము వహించవలెనంటివి. నేను యీరకుంటె నీవ లెనె వారు ద్వారముదాటిపొయ్యేదెగదు తరువాత సదాశివమూర్తిగారి తో నాకుమాటేగదు అట్లకాదుగనుక నీగోత్రసూత్ర నామధేయంబు చె ప్పిచెప్పవమ్మ మహాద్వారం॥ యోగగుమ్మ జారకాంతకుచెప్పుట॥

త్రిపుట॥ అనుచుబలికిన అమ్మతో చెలి అడలుకొనుచును దండమిడు నూ- పేరుజెప్పనుదొణగెనాపుడూ ప్రేమతోనూ॥ అమ్మరోనది బ్రహ్మగోత్ర ముగురుణిసూత్రము నామధేయము- యోగగుమ్మనె పేరుగలిగినాదానయే నూ॥ ౨౩౧॥ అమ్మరో నీవు యోగగుమ్మవ నాకు తెలియక నిన్నడిగితీ- కాగనే నీవిట్టిపలుకులూ పలకనైతీవి॥ ౨౩౨॥ అమ్మరోనన్నడిగితివె నీపేరుయేమని. ప్రేమమీరగా - నీదుపేరూ దెలుపవమ్మా నిజముగానూ॥ ౨౩౩॥ చెలియ రో వినుయోగపురుషులు యోగగుమ్మలు యెవ్వరొచ్చినా - పేరుఅడుగుదు నాదుపేరూ జారకాంతా॥ ౨౩౪॥ జారకాంతావైతెనీవూ శరణుగైకొ ని మనవిగైకొనీ - కడగదొలగవమ్మనీవూ యేనుబోదూ॥ ౨౩౫॥ యెందు బోదువెయోగగుమ్మా అందమైనా పసిడిబొమ్మా - కుందనంపూకులుకుగు మ్మా యోగగుమ్మా॥ ౨౩౬॥ అమ్మరో నేమూర్తికాంతను చూడబోదు నెసు దతియాప్పడూ- మెప్పుదేప్పుడుజూతునోయనీ వేడుకాతో॥ ౨౩౭॥ అమ్మ

రోయీపూలదండలు యెవ్వరేశిరిపునుగుజవ్వాజీ - యెవరునలదిరో దెలుపవ మ్మా యోగమ్మా॥ ౨౩౮॥ అమ్మరో యీపునుగుజౌవ్వాజి పూలదండలు స్థానమందున - గంగసరస్వతివేశినలదిరే వేడ్కతోనూ॥ ౨౩౯॥ అనుచుబ లికీనజారకాంతా ఆత్మలోఅరుదంది అప్పుడూ - తనకుదోచినమాట్లుకును తానివ్వదొణగేజ॥ ౨౪౦॥ పూలుగంధము పునుగుజౌవజి ఆకులోక్కలు ఆరిటిఫలములూ - పళ్ళెరంబులాదేచ్చియీచ్చెనూ పణతికపుడూ॥ ౨౪౧॥ అమ్మరో నేదేచ్చియీచ్చిన నివియుగైకొని నీవుయీప్పుడూ - దాటవమ్మా మూర్తిద్వారము దాటుదాటూ॥ ౨౪౨॥ అనుచుబలికినయోగమ్మా- ఆ త్మలోఆనందమొందీ - నవియుగైకొని మూర్తిద్వారము దాటదొణగేజ॥ ౨౪౩॥ అక్కరో నేమూర్తిద్వారము దాటబోయ్యేదారియెందున - పుల తోటలు సన్నజాజులా సౌఖ్యమేమీ॥ ౨౪౪॥ చెల్లెలు॥ అక్కా యీమహా ద్వారము వెడలుబోయ్యేదారియెందున యున్నచిద్విలాసం యేమనిచెప్పు దమ్మ మహాదేవీ॥ అక్క॥ యీదారియెందున్న చిద్విలాసం మహాద్వార మందునమహాత్యం తెలియజెప్పవమ్మా చెవులపండువుగా వినియెద సుగిణీ మహాద్వారము నీవు చూచినావుగదా చూచినానమ్మ అక్కగారూ, అయి తె చెప్పవమ్మ సుగిణీ॥ చెల్లెలు॥

ద్విపద॥ శ్రీమించుమహాద్వార మందున్నమహాత్య। మమితమైనందమై భరితమైతోచె। విశదంబుగానిపుడువివరింతునీకు। అక్కరోవినవమ్మ ఆనంద ముగను। అక్కడఅమరినఆవనమహాత్య । మిక్కడచెప్పను తరమానటమ్మ। యిన్నంతకన్నంతవివరింతువినుము । మారేళ్ళు నేరేళ్ళు మంచిమామిళ్ళు। గు త్తపూనిమ్మలు గుజ్జుమామిళ్ళు। పొన్నలుపొగడలుపోకమాకులునూ। శ్రీగం ధవృక్షముల్ శీతాఫలాలు। ఖర్జూరవృక్షముల్ కందఫలాలు। పారుజాత ములు అశోకవృక్షములు। అరిటితోటలుమంచి నారికేళములు । కల్పవృక్ష ములుకలజీవివృక్షములూ। యిటువంటివనములో యింపుదలిర్ప। చిలుకలు కోవెలల్ చలిగిచలింప। హంసగమనలు చక్కని పావురములూ। గునగున జక్కవల్ తరువెక్కవరస। చక్కనికొలనలూ మక్కవలలర। మధురమా ఫలములు మాదీఫలములునూ। అంజూరఫలములు అరిటిఫలములునూ । కప ద్దఫలములు జంబుఫలములును। ఖర్జూరఫలములు కమ్మనితేనె। నారంగి ఫ లములు దూదినిమ్మలునూ। వేరుపనసయుమంచి రామాఫలాలు। యిటువం టిఫలములు యింపుదలిర్ప। చూచితినమ్మగురు సూక్ష్మంబుదెలశి। పొంకమా

ఛావులు పూలతోటలనూ। మల్లెలుమొల్లెలు మరిజాజిపూలు। చల్లగావాశిం
చుసంపంగిపూలు। విరులునుచామంతివిరులునుమంచీ। పారుజాతంబులు పొ
గడపూవ్వులునూ । సువర్ణపుష్పముల్ మందహారములు । కలువపూవులు
మంచికాశిరత్నాలు। తెల్లనితుమ్మిపూ దేవగన్నేరులు। మారేడు పత్రియు
మాసుపత్రియును। సారంబుగలరుద్ర జడపత్రియూనూ। కురువేరుదవనము
మఘాయించుపూలు। మరువంపుతీగెయుజాజితీగెలునూ। పందిటిద్రాక్షయు
పుల్లద్రాక్షయును। మధ్యానమల్లెలు నిత్యమల్లెలును। సంపంగిపుష్పముల్చా
లగామరియు। యిటువంటిపుష్పముల్ వికశించియున్న। కన్నులపండువై క
లయజూచితిని। వజ్రవైఢూర్యముల్ పుష్యరాగంబు । లనువొప్పిద్వారంబు
తళతళమెరయు। పచ్చలతోరణల్ ఆణిముత్యాల। కుచ్చులుముందర తులదూ
గుచుండా। నీలంపుస్తంభాలు పగడదులాలు। వజ్రాలబోదెల వొప్పి మొగ
సాల। పచ్చలపలకలా జారునుంచులునూ। చుట్టూరుముత్యాల జాలెలవర
స। కెంపుపచ్చలకుచ్చు లింపలరగట్టి। వనరుగానీరీతివొప్పిమొగసాల। మెం
డుగట్టినఘంట్లు మోయుచునుండ। పన్నీరుకలపము పణతులుజల్ల। తళుకుప
లకల చప్పటమీదనలికె। ముక్తామణుల్ జేరి మృగుదళుకొత్త। యిటువంటివై
భవమింపుతోజూచి। దేహముపులకించి కంపాయమయుండి। పరవశత్వముజెం
దిపావనగాత్రి। గురుకటాక్షముచాత గురుతుగాలేచి । ఆనందమునుబొంది
అక్కరో నేను। చెప్పితినమ్మనీకు చెన్నుమీరగనూ। చూచినంతయునాకుతో
చినంతయునూ। అనినవినిఅక్కయు ఆనందమొందె। వోయమ్మరావెనాశొ
ప్వలకుప్ప। గంగయుసరస్వతి గవిరినిజూడ । త్రివేణిలోమునిగి స్నానంబు
శాయ। త్రివేణితోటలు వనములుజూడ । హంసగమనలజూడ కోవెలలజూ
డ। చకోనిపావురల్ చిలుకలజూడ। మహాద్వారమునుజూడ మరుగులుజూ
డ। పద్మినిస్త్రీలైన పణతులజూడ। దేవతాపుష్పముల్ ఫలములుజూడ। గు
రుకటాక్షముబొంది గురుతుగానిట్లు। చూడంగలేదమ్మ సుదతిరోనెవరు। నీ
వుజూచితివమ్మ నాముద్దుగుమ్మ। నీపుణ్యమేమమ్మ నిజయోగగుమ్మా॥

త్రిపుటం.

చెలియరో నేనేమనందునె నీవుజేశినపుణ్యమిట్టిదీ - తొల్లి జేశినపుణ్యా
మదియూ మళ్ళిగలిగెగా॥ ౨౮౫॥ అక్కరో ఆపూలతోటల మడవగట్లెఅన్న
గారూ- యింతసాధులలో లేచినిలబడి శరణటనిరీ॥ ౨౮౬॥ చెలియరో నీవు
యోగగుమ్మవు గనకవారలుశరణటనిరీ- తిరగశరణని ద్వారమిప్పూడు చా

టవమ్మా॥ అరలి॥ అక్కాగోనేమూ క్తిద్వారము - దాటబోతేలందులోప
ల- సూక్ష్మదేహముతోనయుండే మహాత్మ్యుడెవడూ॥ అరల॥

జంపె.

ఈ స్థలంబే స్థలమొ యీమహాత్మ్యుడెవ్వరో తపోభూమిగ నిదియు
దోచుచున్నాదీ॥ యింతశుచియైన స్థల మెందైనజూడలే- శబ్దంబులేక నిశ్శ
బ్దమైయుంటి॥ పూలతోటలు మంచి పున్నాగవృక్షములు - సంపంగిపూవ్వు
లా సౌఖ్యమేమందూ॥ అనియిట్లు ఆత్మలో ఆశ్చర్యముమబొంది - దేహం
బు పులికించి కంపాయమొందీ॥ యీస్థానమెయ్యదో యీమాన్యులెవ్వరో-
అక్కారో తెలుపమ్మ ఆనందముగనూ॥ చెల్లెలు॥ అక్కా - యీమహాద్వా
రము దాటిచూడగా అక్కడ కనకపీతాంబరము పూలచుశాల్వతో జాజి
బందులు బంగారిజంజ్యముతో రుద్రాక్షవిభూతి గందాక్షంతలతో యాళి
పత్రములు ముత్యాలధారములతో మెడనచంద్రహారములు శిఖాముద్దుటుం
గరముతో యింద్రనీల పచ్చతళుకు కెంపులతో ఖచితమైన గొప్ప కిరీటము
తో కిరీటశిరమున భవానితో యీసింహద్వారములోపల మాణిక్యకాంతి
గల సూక్ష్మదేహముతొ రత్నసింహాసనాశీనుండై సగము కన్నులుమూసి
శుచీర్భూతుడైయున్న యీమహానియుడెవరు యితనిచరితమేమి వీరినామ
ధేయంబేమో బుద్ధిప్రసాదింపుమని ప్రార్ధించెద॥

జంపె.

చెలియరో వినురమ్మ చెన్నుమీరగకొమ్మ - నాముద్దులా గుమ్మ
బంగారుబొమ్మా॥ అనియిట్లు ఆచలిని ఆలింగనముజేసి కూర్చుండబెట్టుకొ
ని కుదురుగాజెప్పె॥ యిది తపోలోకంబు యిదిజ్ఞానపాకంబూ ఆజ్ఞె
యస్థానంబు అతివెరోవినవే॥ యీమహాదేవుడే సదాశివమూర్తియును -
ఆమూర్తివంతమే అమ్మజ్ఞానులకూ॥ కాలదండము కాలపాశంబువీరిదే -
వీరికన్నను మిగుల లేరొండుతేదూ॥ అక్క॥ జ్ఞానస్వరూపిణీ - సుగిణీ -
యీఅగణితంబైన - మహాద్వారములోపల - రత్నసింహాసనాసీనుండై -
వసియించియున్న - మహాదేవుడె సదాశివమూర్తి - అతనికి దళశతహం
సలు అర్పణ - తత్వభూతంలోనేపుట్టి - అచటనెఅణగు - ఆమహాదేవు
నికి-పూజజేసుకోవమ్మా॥ సుగిణీ॥ చెల్లెలు॥ యేమిపూలపూజ శేయవలెనో
చెప్పవమ్మా మహాదేవి॥ ఆసదాశివునికి-దేవగనేరపూలు ప్రీతి - ఆపూల
తో పూజశాయవమ్మా॥

సుగిణి॥ అట్లగేచేశెదనమ్మా అక్కగారూ॥ దశశత జపపూజ సదాశివునికి అర్పణఅవుతూవున్నది॥ చెల్లెలు॥ అక్కా నీయిష్టప్రకారంచేవగన్నేరుపూలతో ఆసదాశివమూర్తికి పూజ చేశితినమ్మా మహాదేవీ॥ అక్క॥ సుగిణి॥ యిట్టి గురువిద్యసాధించి యిన్నిస్థానములయందు దేవతాపూజ చేసుకొని ధర్మదేవతను ఆత్మలోనిలుపుకొని ధ్యానముజేశే వారిదేనమ్మాసామ్ము మోక్షము॥ చెల్లెలు॥

కందార్థము.

అనియిట్లుఅక్కబలికిన । వినిచెల్లెలులేచినిలచి అంజలిబద్ధై । కరములుమోడ్చియుశరణని। ధర్మముగావాస్తువాను సాధించినానూ - ఆసామ్మునే శోధించినానూ - గుణచర్యలునువిడచి గురుధర్మమదితరచీ - యామారకెప్పుడు యెరుకాచేయున్నానూ - యిందుఅందు సందులేని పొందు దెలశి అందముగనే- అందిచూచి పొందిచూచితి ఆత్మలోగురు కరుణవడశి॥ శలవిమ్ము దేవీ- మర్మములుంటెదాచాకుతాయీ॥ అక్క॥

కందార్థము.

వినుచెలియానీవిప్పుడు । నిర్మలమతితోనమంచి నిజగతిమార్గం। కనిచూచియువినిచూచియు। మనిచూచినవమ్మనీవు మావిద్యమార్గం సెయ్యామయోగం సాధించిస్వర్గం- సాటిలేనిపదవి చాపానీవుజూచియు- మాటికీగురుమాటి జవదాటకున్నావు - కొట్టితిట్టికోపపడిన వోర్పుగలిగి నేర్పుగానూ- వుండిగురుణిఆజ్ఞ లోను వున్నఅర్థము కన్నవనుచూ॥ మావిద్యామార్గక్- సైయ్యమయోగక్ సాధించిస్వర్గం॥ చెల్లెలు॥ శరణార్థిఅక్కగారూ మీరుపలికిన ఆనందవాక్యములువిని నామనంబున సంతోషమాయ సదాశివమూర్తిచరితంయెట్టిదో తెలుపవమ్మా అక్కగారూ॥

త్రిపుట.

అతడెనమ్మా చిద్విలాసుడు పిన్నపెద్దల లోనివాసుడూ - అతడెనమ్మా సదాశివుడు అతడెనతడే॥ ౨౪౯॥ అక్కరో ఆచిద్విలాసుడు పిన్నపెద్దలలో నివాసము - యెటుల జేసునో యెరుక పరచుము యోగమందే॥ ౨౫౦॥ చెలియరో ఆచిద్విలాసుడు అంటిఅంటకముట్టిముట్టక - పిన్నపెద్దలలోనెమెలగునె ప్రియముతోనూ॥ ౨౫౧॥ అక్కరో ఆయంటియంటని అనుభవమెమొనాకుదెలుపుమూ- తెలుపవమ్మానీవుయిప్పుడూ తెలుపుతెలుపు॥ ౨౫౨॥ చెలియరోగురుపుత్రుడైయా గురుముఖంబునఅతనిమంత్రము - తరి

చెనేయని వారిఆత్మలో తగిలియుండూ॥ ౨౫౩॥ అక్కరో ఆతగిలియుండిన అంతుదెలిశనునాకుయిప్పూడూ- తగలకుండిన మహాత్మ్యదెలుపుము తరుణమందూ॥ ౨౫౪॥ చెలియరోమదగర్వములచే కన్నుగానకపరమపురుషులతూలనాడేవారినెప్పుడూ తగలకుండూ॥ ౨౫౫॥ అక్కా॥ సుగిణీ నీకుయోగముయింత తెంపుగా తెగడానకు యీచిద్విలాసంబుచూడడానకు నాకు ఆశ్చర్యముగాయున్నదీ నీగురువుయిచ్చిన బ్రహ్మోపదేశ మార్గము ఆయనుభవించూచెనగా నాకు జప్పవమ్మా జ్ఞానరత్నమా నన్నిట్లడెగెనని అనుకోవాస్తు నీవేమి నేనేమి మనయిద్దరికిభేదమున్నదా ఆమార్గమెట్టిదో చెప్పవమ్మా అనియిట్లుబలికిన అక్క పలుకులకు అనందించి కలకలనవ్వి ఆచెలిఅక్కతో యిట్లనియే॥

తత్వము - రేగుప్తి.

దేశికస్వాములాకరుణోయిట్టిదమ్మా- తెలశిఅనుభవించెవారికెంతో అందమమ్మా॥ నాగభోగాప్రతిమమరుగూ తెలిపేనమ్మా- హానిబాగుమీరగ యోగమందు గూడితమ్మా॥ అనుపల్లవి॥ గూడితివేడుక చూచితిమధురముకోరితిసద్గురు కోకాదలిర్పగ॥ దేశికస్వామి॥ కందూవాపక్షులా జాడగంటినమ్మా- వాటైపొందూ దెలశి కలశియిందుంటినమ్మా- కాలముదెలశి మేలిమినోంది వాలలాడితీకోలహాలముగ॥ దేశిక॥ అందారాని అరుణచిత్రా మనుభవామ్మ- గురుణిపాదారవిందముల బృందామందీతమ్మా- అందితి యలరుచుఆపజ్యోతిని పొందితిబాగుగభోగశాలినై॥ దేశిక॥ యజ్ఞాసూత్రామూలాధారామేశితమ్మా - యేశిరేచించితత్పురుషా మొకమై వుంటీనమ్మా- వుండెనుదండిగకుండలియందున- నిండెనుజగములోనిగమగోచరుడు॥ దేశిక॥ ప్రణవానాదామూలారవములింటీనమ్మా- జంపాయింటినాగస్వరము లంటిపూదితమ్మా- కంటిగురుణి యీసరోవరంబున - మరాళిదెలిపిన వరాలస్వామినీ॥ దేశిక॥ నాశికాగ్రామూలా మర్మమెచాలూనమ్మా- మాకూయెకుక్కావా పోకాలుబోనింకేలనమ్మా - చాలుసద్గురు మేలుదలంచిన- అంతకుదూతలు చెంతనజేరరూ॥ దేశిక॥ పున్నామాచంద్రూని పొడగంటినమ్మా- పండూవెన్నెలలో పవ్వాళించియుంటీనమ్మా- గండుతుమ్మెదలు మెండుగ మ్రోవగ- పన్నగమాడెనుఫాలభాగమునా॥ దేశిక॥ మూడూమండాలములు దాటిపోతీనమ్మా- స్వర్ణ మండాపములో చంద్రా కాంతా యుంగౌనమ్మా- ఖండితముగధరనిండేన వెలుగులోపుండరీకమునవుండబూచితి॥ దేశిక॥

సుబ్బా గురుడీసూత్ర్మ రహస్యంజెలిపెనమ్మా- తెలశియేవుమీర రేపుమాపు జూచితమ్మా - చూచితిశుభమౌ సూత్మ్మమూర్తిలో సునీలమధ్యాము సూర్య కాంతమూ॥ దేశికస్వాములాల కరుణయిట్టిదమ్మా- తెలశిఅనుభవించే వారి కెంతో అందామమ్మా॥

ద్విపద॥ శ్రీమించుగంగాయపల్లెశివదీక్షు । అక్కరోవినవమ్మ ఆనందముగను । గురుపాదమునుబట్టిగురుతులోనిలచి - శేవించుచున్నాను చలనంబులేక । చెవులనువిన్నానుసద్గురుగోష్టి । అట్టిమద్గురుస్వామి మధుపలుకులెపుడు । యిరువదోకేరయిఆర్నూరువాస్తు । ప్రకటించిరేబగల్ ఘూణిజల్లుచున్న । అట్లుఘూణజల్లెటిహంసతారకము । వాకురనఅన్నాను వరసగానెపుడు । నాశికాగ్రమునున్ననాటికధరుని । చూచినగైకొని సూత్రంబులాడి । పాత్రంబులోనున్నమాత్రికబట్టి । అణువులోనణువైన ఆసదాశివుని । కన్నులగన్నాను క్రమముగానెపుడు । కాశీనివాసుని ఆషహామవునీ॥

వచనం॥ సద్గురుస్వామికి సమానమైనటువంటి అకరగారూ మరివకవినయంబుజెప్పెద ఆకర్ణింపుము. అతల, వితల, సుతల, రసాతల, తలాతల, మహాతల, పాతాళం మొదులుకొని భూలోక భువర్లోక, సువర్లోక, మహర్లోక, మత్సలోక, తపోలోక, సత్యలోకము వరకువ్యాపించి, సద్గురుస్వామైన మహాదేవుని సేవించి తిరిగి చిదాకాశముదాకి మండలిత్రియములుదిగి జగజ్జాలమనె భూలోకానకు వొచ్చి వకరనిమిషమాత్రాన యిట్లొచ్చిపోవుచున్న పరమహంసలను గురునిచేగ్రహించి వాటెజోడుగూడి సంచరించి వదగివర్తించి ఆజపమంత్రముజపించి అనుభవశిద్ధాంతంఆచరించి- యిట్లున్నదానను - నీకు తెలియనిదేమున్నదమ్మా అకరగారూ॥ అనిన చెల్లెలివాక్యములకు సంతోషించిఅకర యిట్లనియె॥

ద్విపద॥ శ్రీవినుశివదీక్షుమహాత్యంబు మరియు । వినుము తెలిపెదనీకు విశదంబుగాను । సాకారమున గురుని సద్భక్తి ఆత్మ । మరువక తలపోశి మమతోయున్న । హ్మాయతోభక్తులకు మమతయుబుట్టి । మదిలోన కోరిక ల్ మరిపికరటిల్లి । మణిమయభూషణ మగుటముల్ గోరి । జిని జీనాంబర వస్త్రములుల్ గోరి। మదిలోన మాధుర్యఫలములుగోరి। యిండ్లుమేడలుగోరి విధమునవారు । భవనభవనేశ్వరభోగముల్ గోరి । ఆలుపిల్లలగోరి ఆత్మ

లో మరియు । చుట్టాలమదిగోరి సూక్ష్మంబు మరచి। వకరిసొమ్ములు అప హరించనుగోరి । వకరిమేలాత్మలో నోర్వలేకుండి । తనమేలు ఆత్మలో తలపోయుచుండి । యిట్లుండె గుణములు లెక్కయు లేదు । యిట్టిగుణముల జేరిహీనులైవారు । గురుభక్తియునుదప్పి గుణహీనులగుచు - మాయలో బడిమునిగి మమతలుమించి । గడువంగలేక యాకాలునిబారి । నరకపాత్రు లగుచు నర్లుచుబడిరీ । యీగుణంబులజేరకి విధవరొనీవు । పుట్టినవాస్తు వుల్ భువిలోనద్రోకిక । కలిగినవాసువుల్ కలలోననైన । తెలువంగరా దంచు తాత్పర్యమంది । మనసుగట్టిగ నిలిపి మద్గురుకరుణ । తలపోయుచు ను యిన్నిస్థానంబులందు। వున్నమాత్ములకు గురుపూజజేయుచునూ। ఆధా రస్వాధిష్టమణిపూరకమున । అనాహత విశుద్ధ ఆగ్నేయమందు । పూజ జేసితివమ్మ పుణ్యాత్మురాల । యేమని వివరింతు । యేమి జెప్పుదును । గురుకరుణ ఆత్మలో గురుతుగా నిలిపీ । మద్గురుకరుణచే మాయలువిడచి। యిలమాయలోపక్క విడుములుబడక । అంటిదామెరనీరు అంటకున్నట్లు । మంటికుమ్మరిపురుగు కంటికున్నట్లు । రసము రసమునగూడి రంజిల్లునట్లు । కపురంపుజోతిగలసియున్నట్లు। ముత్యాలహారమున ధారమున్నట్లు । యయి నానైవు యీరీతి వునికికి మీరి మాయలనేవాటె మర్మంబుదెలశీ॥ అక్క॥ జ్ఞానస్వరూపిణీ- సుగిణీ- నీకొక్కవినయంబు జెప్పెద విను సాధులైన వారు సాత్మీకగుణముచేత గురుముఖంబున మంత్రంబు గ్రహించి గురుకరు ణచేత భూలోకములో, యెట్లానటింతురంటె యుదకములోయున్న - తామెరపై బిందుసోకివప్పటికీ నంటినిక్కైవడి సాధుత్వముచేత కలిమాయ నటకకెంతపదవిగ్గైకొంటివమ్మా సుగిణీ ప్రాణసఖి వాస్తవా॥

మాలిని.

భారతి నీసరియెవరని కోరిరి యాసురమానులు। కొక్కెదలిర్పక । సారసనేత్రిరో నిను సన్నుతిజేసెటి సాధులవాక్కన । మన్నతో నుంచు వమ్మ మంజులవాణీ॥

గద్యము.

ఇది శ్రీమదఖిల విద్యత్కవి జేగీయమాన సరసకవిశానంత విద్యా విశేషానంత జగణార్చన మహాతత్వశిద్ధియక్గల జ్ఞానస్వరూపిణి ఆత్మ స్వరూపిణి అనే అమ్మగారైన అక్కచెల్లిలి వేదాంత సంవాదంబునందు అక్కచెల్లెలికి బోధించిన త్రివేణిమహాత్యము అప్పటి గంగా సరస్వతి

గౌరి అనే అమ్మగారి రూపు విభ్రమ విలాస లావణ్యములు ఆత్మస్వరూపిణి అనే చెల్లెలు త్రివేణియందు స్నానంబుచేయడము. అచ్చట గంగ స్నానంబుచేసే ఆత్మస్వరూపిణిని నాకు యేమిస్తివి అని అడగడము అపుడు ఆయాత్మస్వరూపిణి మదించిన మహిషమును ఆగతియివ్వడము దాని గైకొని గంగ సంతోషించడము. స్నానంబుచేసి గట్టుకువచ్చిన ఆత్మస్వరూపిణికి గౌరిసరస్వతి గంగఅనే అమ్మగారు వస్త్రాభరణాదులు అత్తరు పునుగు జవ్వాజి పుష్పమాలికలువేసి నలదడము, అచ్చటినుంచి ఆయోగమునందుయుండిన ఆత్మస్వరూపిణి అనె అమ్మగారికి గజమును తెప్పించడము ఆగజముపై ఆయాత్మ స్వరూపిణిని గజముపై నెక్కించి యుత్సవ మహోత్సవములు చేయడము వారివెంట అనేకపుణ్యస్త్రీలు వారకాంతలు మొదలుగాగలవారలు జయశబ్దములతో శాషలు చల్లడము అచ్చటనుంచి మంగళహారతు లివ్వడము యీరీతిచేసినవెనుక ఆయాత్మస్వరూపిణి ఆగజమును దిగి సెలవులడగము వారు యిచ్చటనేయుండమని చెప్పడము. అందుకు ఆమె నేను ముక్తికాంత దరిశనానికి పోవలెనని విన్నవించడము. అందుకువారలుపోదువుగాని మా శొక్యవమహాత్యములు చూస్తువురమ్మని పిలుచుకపోవడము అచ్చటివింతలు చూడడము అచ్చటయుండిన ఫలవృక్షములు పుష్పవిరులు భృంగఝుంకారధ్వనులు అందుకు నురగములు పడిగెత్తి ఆడడము యీమహావింతలు అత్యాశ్చర్యకరమైయున్నదని వూహించడము. యిట్లు ఆశ్చర్యమగ్నమై నిలచిన ఆత్మస్వరూపిణిని ఆయమ్మగారు శృంగారమహలుకు పిలుచుకపోవడము దానియొక్క మరకత మాణిక్య గోమేధిక పుష్యరాగ కలితములై వొప్పియున్నదని వర్ణించడము నాదిగాగల షష్టమస్కంధములో వర్ణించి యిందులోనె సప్తమస్కంధము యొక్క వర్ణనయు దానిమహాత్యము వర్ణిస్తాయున్నాము. అచ్చటినుంచి ఆయాత్మస్వరూపిణి అమ్మగారి సెలవులు పొందడము వారుసెలవులిచ్చి యీయోగముచేత పొమ్మ్యె అమ్మగారిని గంగ సరస్వతి గౌరి అనె అమ్మగారు సాగనిడిచి అచ్చట ఆయమతో యెపుడు యీత్రివేణికి స్నానానికి వొచ్చినా మాకు దరిశనం యివ్వమని చెప్పడము, ఆమెనమస్కరించి అందుకు సమ్మతించడము అక్కడనుంచి మహాద్వారము దరిసించడము ద్వారముకు కట్టిన వింతలుకు మహాసంతోషించడము దాని మహాత్యము చెప్పటకు దుర్లభంబని యెంచడము. అచ్చటయుండిన సదాశివమూర్తిని దరి

సించడము వారి ప్రభావము అద్భుతమని యెంచడమున్ను జారకాంతదరి శనం జారకాంతకు తనకు నైన సంవాదప్రకారంబు జారకాంత యొక్క వర్ణన అచ్చటయుండిన కల్పవృక్షములు పూదోలు పొన్నలు పోకలువిరులు తేనెలు మొదలుగాగల తరువర్ణనయు విరుల వర్ణనయు సూక్ష్మమూర్తి అనే అమ్మగారు తపో ప్రభావమువల్ల వేదాంతార్థముగా వర్ణించి సద్గురుస్వామిఅయిన విరాటు విశ్వబ్రహ్మ కరుణచేత పరమేశ్వరర్పితముగా నిర్ణయించిన సహస్రారములోని షష్ఠమస్కంధము సప్తమస్కంధము సంపూర్ణము.

— —

త్రిపుట.

అక్కరో యీమూర్తిద్వారము నందుయుండిన చెరితజూచితి- అందుపైగాచూడపాప్టా పగులుయేమీ॥ ౨౫౭॥

వచనం॥ సూర్యమండలం నిర్ణయం వివరిస్తూవున్నాము.

త్రిపుట॥ భ్రమశేవమ్మా నీవుచెలియా సూర్యమండల మందు వెలుగదీ- యిందుదగిలెనునీవుయిప్పుడు వెర శేవమ్మా॥ ౨౫౮॥ అక్కరో నీవుండగానాకేమిభయము వెరసభ్రమసా- సూర్యమండల మనగయేమో తెలుపవమ్మా॥ ౨౫౯॥ చెలియరో ఆస్థానమందున అష్టదళములపొద్మముండునూ- యరలవశేషసాహాయనిదళములందున బీజలుండునూబింబముండూ॥ ౨౬౦॥ అక్కరో ఆస్థానమందుకు యెక్కపొయ్యే నేర్పు చెలువుమూ- ఓర్పుగలిగిచూతునమ్మా నేర్పుతోనూ॥ ౨౬౧॥

సీసపద్యములు.

ధర్మార్థశాలవై పరమార్థముగ నాకు మర్మంబు దెలిపినావమ్మ శరణు। స్థానస్థానంబులాదగిలినా వెంటనె వొచ్చిరక్షించినా వక్క శరణు । నీయాజ్ఞ మీరక ఙ్నీహృద్దులోనిలచి నీమాటనమ్మి నానిజముశరణు । కర్మనిజ్ఞానంబుకలియప్రూహారంబు మెచ్చిమెడనేశినావమ్మశరణు। స్థానమెట్లాగుచాటవలెతల్లి శరణు। కరుణవుంచియువన్ను కడతేర్చుశరణు । దివ్యకోమలనీశుభాంగములకుశరణు। సూర్యస్థానంబు దాటించుశుభముగా నంటిశరణు॥ సీ॥ నీభక్తిభావనకు నీధైర్యశక్తికి నీస్వానుభూతికిదీవెనంటే। నీమనోవృత్తికినీ సాధుబుద్ధికి నీజ్ఞానభక్తికి జయమునంటి।నీయోగభావముకునీనిష్టనిలువుటకు నీకుకష్టములేదు అభయమంటి। నీపరమహంసలకు నీపట్టువిడుపుకూ నీగ

ట్రితనముకు నమ్మికంటే। అనుచుబలికియాచెల్లెలీనలుముకొనుచు। సూర్యమం డలస్థానమిది సూటిగాను। చూపుచుంచియుహంసల నెగయదోలి। మొకరు- చకరు-గనిష్టతో చరణలేమి॥

చెల్లెలు॥ అకారు-శరగార్ధి యిప్పుడు యీమండలసమీపమునకు పో వగా అగ్నిజ్వాలలపగిది దహించుచున్నది యీమండలము సునాయాసము గాదాటె మర్మమేదో అది తెలుపవమ్మా పూర్ణదయతోఅకరు-గారూ॥ అకరు-॥ జ్ఞానస్వరూపిణి సుగిణీ అష్టాక్షరీమంత్రం ఆత్మలోనుడువుచు హం సలనణచిపట్టి రేచించివెంటనెపూరించి పూరకమైన హంసల పొర్లి రేచించ కుండా మెగయదోలి చంద్రకిరణములు నేత్రములకుధరించుకొని యకరువ మ్మా దళములంతూ తదేకనిష్టతో మంత్రధ్యానంచేస్తూ అష్టాక్షరిమంత్రం నీకు అనుభవమేగదు అనుభవమేనమ్మఅకరు-గారూ॥

త్రిపుట.

చెయరోఆహంసకారుని అణచపట్టి రేచకంబున - పూరకంబైమె కరు-వమ్మదళములందూ॥ ౨౧॥ అకరు-రోనేరేచకంబైపూరకంబునమెకరు- దళములూ- పైగచూడగకోటిసూర్యులా దీప్తియేమీ॥ ౨౨॥ చెల్లెలు॥ అ కారు-॥ అష్టాక్షరిమంత్రం ధ్యానముచేస్తూ హంసలనణచిపట్టి రేచించిపూ రించి రేచకానికిరాకుండా అరికట్టి వాటెనుమెగయదోలి దళములందుమె కరు-చూడగా కోటిసూర్యులకాంతివెలుగుచున్నది ఆవెలుగు భరించి హరిం చిచూడడానకు శక్యపడక అశక్యమైయున్నది అదియేమోత్వరగా తెలుప వమ్మా మహాదేవీ॥

త్రిపుట॥

చెలియరో సాహస్రారమందున వీధివీధులయుండె వెలుగ దీ- యెంతవారికి కలుగునేఆవెలుగుజూడా॥ ౨౩॥ అకరు-రోసాహస్రార మంటివి వీధివీధులవెలుగటంటివి - యంతవారికి దొరుకునంటివి అనగయే మీ॥ ౨౪॥ అకరు-॥ జ్ఞానస్వరూపిణీ సుగిణీ నీవుభూలోకమందుపుట్టి భో నైై బ్రహ్మోపదేశముపొందియోగివై మనస్సుతెంపుచాత త్యాగివైనీకు స్మరణకటాక్షవీక్షణంబుచాత యింతఅనుభవసిద్ధాంతివై తివికచా యిపు అలివమ్మా మనస్సునిలిపి బ్రహ్మపదవి చూడడానకు జ్ఞానులమని ని వేత్తలమనిమానులమని మహాత్ములమని గురువులమని చెప్పకుం ల్లుపోను క్రియయేది సుగిణీ నీకొకరు-వినయంబుచెప్పెద విను॥

తత్వము- రేగుప్తి- అటతాళము.

సాధూసజ్జనమూలా సద్గోష్టివినకున్నా యోగగుమ్మా- సద్గురుపూలశేవింపా గురుతెల్లాటోరుకునె సుగుణికొమ్మా॥ సాధు॥ ౧॥ కడతేరే మార్గామూ కానలేకచెలియా యోగగుమ్మా- వారూ యిలమాయలో జిక్కియిడుమూలుబడుదూరె సుగుణికొమ్మా॥ సాధు॥ ౨॥ దేహములోయున్నా మాయానువిడకున్నా యోగగుమ్మా- గూరూమంత్రాముపదేశించ మనసట్లనిలచునా సుగుణికొమ్మా॥ సాధు॥ ౩॥ అసరాబూకులమాయి ఆరువర్గముదాటీ యోగగుమ్మా- గూరూమంత్రాముపదేశించీ మాయాను విడచినౌసుగుణికొమ్మా॥ సాధు॥ ౪॥ తీపూలోతీపైన తియ్యామామిడిపండూ యోగగుమ్మా- పండూపాకాముగురుతెరిగి ఫలహారంచాయలేరు సుగుణికొమ్మా॥ సాధు॥ ౫॥ గురుకరుణాయెంచాను అలివిగాదెచెలియా యోగగుమ్మా- ఆవిష్ణుయీశ్వరబ్రహ్మ సురరాజుకైనాను సుగుణికొమ్మా॥ సాధు॥ ౬॥ గురువూలాశేవించీ గురుతుగైకొనకున్న యోగగుమ్మా- మోక్షమెట్లు కలుగునమ్మా యేగాతివారికి సుగుణికొమ్మా॥ సాధు॥ ౭॥ పెద్దాలమనిగొప్పా పేరూపెట్టుకోని యోగగుమ్మా- బుద్ధిలేకతిరిగి బాధ్యాలైచెడిరంతె సుగుణికొమ్మా॥ సా॥ ౮॥ సకలో జీవులయందూ సారాధివైనావె యోగగుమ్మా - సారా మెరిగీనవారికి సద్గూరువైనావు సుగుణికొమ్మా॥ సాధు॥ ౯॥ నీమహిమాకనువారూ నిజమూగయిప్పుడూ యోగగుమ్మా- గూరూ ధర్మాముదాప్పాకా గురుతులోయున్నారే సుగుణికొమ్మా॥ సాధు॥ ౧౦॥ స్త్రీలభోగముచాతా చాలానముందురేయోగగుమ్మా- గూరూమార్గాముదెలియకా మత్తులైచెడినారూ సుగుణికొమ్మా॥ సాధు॥ ౧౧॥ మాయానువిడచేటీమర్మాముదెలుసుకొనీ యోగగుమ్మా- నీకాయాములో యున్నా హరునిజూచితివమ్మా సుగుణికొమ్మా॥ సాధు॥ ౧౨॥ అలవిగాని పదవీ అమ్మానీగురుధర్మం యోగగుమ్మా - చెలియా పొందగనీగురుకరుణా పాలుపొంగినట్లూ సుగుణికొమ్మా॥ సాధు॥ ౧౩॥ యిఘమేమి కొదవుందీ యిలజన్మామెత్తాను యోగగుమ్మా- చెలియా సత్తైనవోస్తూవా సారాప్రకటించె సుగుణికొమ్మా॥ సాధు॥ ౧౪॥ సుబ్బాగురుణికరుణా మాగునీకేతెలుసు యోగగుమ్మా- అబ్బాయితరూలకేమెరుకా యీసొమ్ము సాధించా సుగుణికొమ్మా॥ సాధు॥ ౧౫॥ నీమీద దయయుంచి నిన్నేలిరక్షి యోగగుమ్మా - చెలియా యేలీనాగురుకరుణా వెయ్యేలుజేసుగా సు

కొమ్మా॥ సాధు॥ ౧౬ ॥ సాధుసజ్జన మూలా సద్గోష్టి వినకున్నా యోగ గుమ్మా॥ సాధు॥ ౧౭॥

వ॥ అనియిట్లుపలికిన అక్కకునమస్కరించి ఆచెలియిట్లనియె॥

తత్వము - ముఖారి రాగం - ఆది.

ఆత్మాలోఆనందామాయగా- నాదుసుబ్బావగురుణీ కరుణాజూడ గా- యెంతోఆనందామానందామాయగా - గురుడుస్వానందా భావమం దూంచగా- అమ్మాచూస్తినేగురుణికరుణ చూడావేడూకలాయా॥ఆత్మా॥ ౧॥ యేదారియెందునచూడగా- గురుడుఆదారిమై అందుండెగా- నాయా త్మాలో దండిగనిండెగా- అమ్మానిండీన గురుణికరుణ పండీప్రబాల మా యా॥ ఆత్మా॥ ౨॥ ముగ్గూర్నిమూచ్చ్వాలబాట్టుకా- నెట్టిమువ్వేటికావలికి బోవగా- ఆడాపంచాకన్నెలు పదరిచూడగా- అమ్మాశీఘ్రూమె నాగురువ చెె ముకూకచెవ్వూలుగుస్తే॥ ఆత్మా॥ ౩॥తలవ్పూచితలవ్పూచీ గురుడూచూచె గా- ఆడసూత్మమూర్తిచే జోడించుండెగా- అప్పుడుగురుడొక్కమాట వు చ్చారించెగా- అమ్మతెస్తివె ముగ్గురిదొరలమోసాము నీకులేదనె॥ ఆత్మా॥ ౪॥ అద్దాలమేడొక్కటుండెగా- బుద్ధిఆత్మాలోనిలిపి అలరిచూడగా- గురు డుఅద్దాలమేడలోకి పోవగా- అమ్మాపొద్దూపొడుప్పూనజూడ పొలతితా ని ద్దరుండ్రీ॥ ఆత్మా॥ ౫॥ అద్దాలమేడలోనుంచిగా- గురుడుస్నానానికేత్నం బుజాయగా- అవుడుమూతాబుమూత్తులుబాట్టిగా- మంచిపగలార్తి దీటీలు పాట్రిగా- అమ్మాత్రివేణిసంగమందు పొంగిస్నానముజాయ॥ ఆత్మాలో ఆనందమూయగా॥ ౬॥

ఇట్లుపలికిన మృదువాక్యములకు సంతోషించి అక్క ఆచెలితో యిట్లనియె.

సాహస్రారకమలనిర్ణయము వివరిస్తూ యున్నాము-

త్రిపుట.

చెలియరో సాహాస్రారమందున వేయురేకుల కమలముండునూ - కమలమాందున కోటిసూర్యులా కాంతియుండూ॥ ౨౬౫॥ అక్కరో ఆవే యురేకుల కమలమందునయున్నచరితము - యేమొతెలుపుము తరణమందు నాకనశినాట్లూ॥౨౬౬॥ చెలియరో ఆవేయురేకుల కమలమాందున సాక్షి భూతమూ॥ ఆకారం॥ అండగాచుకయుండు సావాజాత్మశక్తి॥ ౨౬౭॥ అక్కరో ఆసాక్షిభూతము సొబగుదెలుపుము సొంపుమీరగా- జాత్మశక్తి

అనగ నేమో తెలుపవమ్మా॥ ౨౭౮॥ చెలియరో ఆశక్తియందున వక్కణెపె ఓంకారబీజమూ- ఝుమ్మ్ఝుమ్మని ఝాంకరించునె నాదమెవ్వడూ॥ ౨౭౯॥ అక్కరో ఝాంకారనాదము యెటులబలుకునో యెరుకపరుచుము సరకు సేయక చెప్పవమ్మా సౌజ్ఞయేమో॥ ౨౮౦॥ చెలియరో ఝాంకారనాదము పలుకులవి బహుచిత్రహర్షమూ పరమభక్తితో యీయాండునమ్మా అమృతమంటే॥ ౨౮౧॥ అక్కరో ఆయమృతమంటెసి అంతుదెలుపుము నీవు యీప్పుడూ వివరముగ దెలుపమ్మనాకూ యిందుకందూ॥ ౨౮౨॥ చెలియరో ఝాంకారనాదము దశవిధంబుల బలుకుచుండును దశశతంబుల హంసలైనది ఆడుచుండూ॥ ౨౮౩॥ అక్కరో ఆవేయిరేకుల కమలమందున చూడబోతే పట్టపగులుగ వెలుగుచుండెటి ప్రభువెవరూ॥ ౨౮౪॥

తోహరా॥ పరమాత్మయనితలచీ పంచాక్షరమూతరచీ - వెలిగే ప్రభువునుజూచియూ చెలి వేటకామీరగానూ- యీప్రభువుయవ్వరోస్థానము యెయ్యదో తెలుపుప్రేమతోనూ ॥పర॥ నిరామయుండీ నిర్వికల్పునీ నిష్ఠ దెలుపవమ్మా స్పష్టముగా నేశోధన జేతును యిష్టముగాకోమ్మా॥ పరమా॥

చెల్లెలు॥ అక్కాయీస్థానమందున యోగజిహ్వనునిలిపి - పరమహంసలను గూడుకొని మారుతముకదలకుండా - చూపుచెదరకాక కన్నోల యెంచు దృక్కునిల్పిచూడగా అక్కడకానబడేవాస్తువ అఖండుండై ద్రాక్షమాలికాదురంధరుండై అపరంజి బంగారుకు సమానమైన దేహముగలవాడై చతుర్రత్నకిరీటుండై- నిర్వికల్పనిగంజనుండై సమదృష్టిచాతనిష్ఠాగరిష్ఠత్వముతోదక్షిణముఖుండై - వేయిరేకులకమలమందున శుభ్రాసనాసీనుండై - మెరుపుతీగవలెతళుకుస్తూ పట్టపగులువలె వెలుగుచున్నయీ ప్రభుయవ్వరు - వీరిచరితమేమివీరినామధేయంబేమో త్వరగాప్రసాదింపుమని ప్రార్థించెద॥

తోహరా॥ పరమాత్మయనితలుచు పంచాక్షర మేయనుడీ- చెలియీయిదిసహస్రారస్థానమూ సత్యలోకమమ్మా యెతులు యేకాంగులుమానులు జూచేపరమపదమేకోమ్మా ॥ పరమా ॥ సూక్ష్మదేహమునో వెలిగే ప్రభువేసద్గురుస్వామమ్మ - భక్తాదులకూప్రాణాధారము భావములోకోమ్మా ॥పర॥ అక్క జ్ఞానస్వరూపిణి- సుగిణి యీయగణితంబైన మహాస్థానమందున్న చరితము తెలియచేతుము - విను ॥ సుగిణి యీస్థానమందున పట్టపగులువలెవెలుగుచుండే ప్రభువేసద్గురుండు వారికంటె యెక్కువమేమిలేదు వీరికిదశశతహంసలు అర్పణజాత్మ శక్తిలోనేపుట్టి

అచటనేఅణుగు యీమహాదేవుడైన సద్గురుస్వామికి పూజచేసుకోవమ్మా సుగిణీ॥ యేమిపూలపూజశాయవలెనో చెప్పవమ్మా మహాదేవీ॥ సువర్ణపుష్పాలతో గురుర్బ్రహ్మా గురోర్విష్ణు గురుదేవో మహేశ్వరా గురుసాక్షాత్ పరబ్రహ్మా తస్మైశ్రీగురువేనమః అని ఓంనమోశివాయని యీమంత్రపుష్పాలచేత పూజచేసుకోవమ్మా సుగిణీ దశశతజపపూజ సద్గురుస్వామికి అర్పణఅవుతూ వున్నదీ॥

త్రిపుటం.

అతడైనమ్మా నిర్వికల్పుడూ నిత్యానందుడూ జ్యోతిరూపుడు - సచ్చిదానంద స్వరూపుడు సద్గురుండూ॥ ౨౭౫॥ అక్కరో ఆనిర్వికల్పుని నిత్యానందునిజ్యోతిరూపునీ - మహత్మదెల్పుము నీవుయీప్పుడుఖ్యాతిగాను॥ ౨౭౬॥ చెలియరో ఆజ్యోతిరూపుడు అందరందుననిర్వికల్పుడూ - నిత్యానందుడుపరమపురుషులా సద్గురుండూ॥ ౨౭౭॥ అక్కరో ఆప్రభువుచరిత్రము తెలిశనీప్పుడు తేటతెలివిగా- మూర్తికాంతాయేదో తెలుపుము ముదముతోను॥ ౨౭౮॥ కలికిరో వేచిలుకపలుకుల కోలికిరావేనీవుమన్మథా - ములకరావె కలువరేకులా కన్యరావే॥ ౨౭౯॥ అక్క-బలికినపలుకులకుచాలి నందభావమునొందిఅప్పుడూ - శిగ్గుపడితా శిరమువొంచుకా వొచ్చినిలచెన్॥ ౨౮౦॥ వొచ్చినిలచినచెలియనప్పుడూ తొడలపైతానెత్తినిడుకొని- మూర్తికాంతనుజూడవలెనా ముదితనీవు॥ ౨౮౧॥ అక్కరో నేచూడవలెనూ మూర్తికాంతను కలయవలెనూ - అమృతపానముశాయవలెనే సందముగను॥ ౨౮౨॥ చెలిపలికినపలుకులకు ఆనందాభావమునొందిఅక్కయిపూ- సుదతిరో ఆకమలమందునా చూడువేగా॥ ౨౮౩॥ అక్కరో నేనటుల జూతునో అంతుదెలుపుము ఆదిజూపుమూ - ముదముతో నేజూతునమ్మా మెనసినాటూ॥ ౨౮౪॥ చెలియరో నీవటులయిటులా కదలకుండా కమలమందునా- వేయురేకులనడమజూడుమూ వేటక-తోనూ॥ ౨౮౫॥ అక్కరో నేనటులవిటుల కదలకుండా కమలమందునా - వేయురేకులనడమజూడనా వెలుగుచుండీ॥ ౨౮౬॥ చెలియరో ఆవెలుగుచుండే కాంతయేటువలె యున్నదోమరీ- నాకుజెప్పవమునేనువించునూ నయముతోను॥ ౨౮౭॥ అక్కరో ఆకమలమందున తూగుటుయ్యాలపానుపందున- పవ్వళించియున్నదమ్మా పువ్వులలోను॥ ౨౮౮॥

తోహరా॥ నమశివాయనుచు ఓంకారబీజమేగనుచూ॥ అకాయీ
కనకశరీరముకలకలలాడే కాంతాయవరమ్మా- తెలుపుమియీప్పుడు యీ
మెచెరితము తేటగానుకోమ్మా॥ నమ॥ వేయుసూర్యులకాంతిముఖమునా వె
లయుచున్నదమ్మా- యెప్పుడుగనలేయిట్టిపాద్మిని పణతినినేకోమ్మా॥ నమ॥
కుందనమేశినఅపరంజికిసరి దేహకాంతులమ్మా - కన్నులబూడామిర్రురుమిట్లు
గాగానవొచ్చెకోమ్మా॥ నమ॥ కలువరేకులకుమించియున్నవి కాంతకన్ను
లమ్మా- వెన్నెలముఖమునవెలయుచున్నదీ యేమిజెప్పదమ్మా॥ నమశివాయ
యనుచూ ఓంకారబీజమెగనుచూ॥ చెల్లెలు॥ అకా- శరణార్తిని యిప్పడీ
కమలమందునకాగిన బంగారుతీగెకు సమానముగాధళాయిస్తూ పూలలో
పలపవ్వళించియున్న యీకాంతయెవ్వరో యీమహాదేవి నామధేయం బే
మో త్వరగా తెలియజేయుమని విన్నవించెద॥

తోహరా॥ నమశివాయయనుడీ ఓంకారబీజమే గనుడీ॥ ఆమేచెలి
యా మూలవిరాట్టూ ముక్తికాంతకోమ్మా - ఆకాంతవొద్దనే అమృతము
న్నది త్వరగాబోవమ్మా॥ నమ॥ నమ్మినభక్తులరమ్మనిపిలచేరాజీవాక్షమ్మా-
భక్తకోటినిరక్షణజేశే శ్రీరత్నమెకోమ్మా॥ నమ॥ కైవల్యంబిదె ముక్తిపదం
బిదె పరమపదమెకోమ్మా- యింతకుపైగా నిరాలంబమూ యేమిలేదు కో
మ్మా॥ నమ॥ చెలియా విసునీవెంతపుణ్యమూ జేసుకున్నవమ్మా- సత్యలోక
మీపరమపదము గైకొంటివిగదెకోమ్మా॥ నమశివాయయనుడీ॥

వచనం॥ అనియిట్లు పలికిన అక్క పలుకులకు ఆనందించిన చెల్లెలికి
యిట్లనియే. సుగుణీ॥ ముక్తికాంతదర్శన మాయెనా, ఆయెనమ్మా కన్నుల
పండువుగాచూచితివే, చూచితినమ్మా- యెంతపదవి గైకొంటివమ్మామీయా
నుజ్ఞచాత గైకొంటినమ్మా నీకికఘజన్మంబులేదు॥ చెల్లెలు॥ అమృతపానము
చేస్తేకదా జన్మరహితమైయ్యేది అక్కగారూ॥ ఆహా చేసినట్టె యిఘుయే
మున్నదీ చాయక॥ ఆచెలియను అక్క అడుగుట॥

ఆనందగోచరమైన యాలలు.

అటతాళం - కల్యాణిరాగము.

అమ్మానీలోనిన్నూకనళే ఆత్మాకలుషాపాయాలూ ఏడచీ - గురువరే
ణ్యుల కలశీయున్నావూ॥ వోవో యోగాగుమ్మా॥ నిన్ననీవూ చూచూకు
న్నావూ॥ ఎ॥ అరిటీగాచీఅయిదూచిలుకాలాత్మాలోనేయున్నావనుచూ-
తోరహంసాల నెగయాదోలియూ॥ వోవోయోగగుమ్మా॥ వురులువొడ్డీప

ట్టూకున్నావూ॥ ౨॥ యెడమాకుడినాతిరుగూచుండే రాజాహంసాల గూ
డూకోనీ- పంచకోణములోటీమిథునామూ॥ వోవోయోగాగుమ్మా॥ పొం
చీపొంచీ వేశీయున్నావూ॥ ౩॥ నిత్యాభావా సత్యాసాగరమై॥ జ్యోతి
నై త్రీనీవూ- ఆత్మఅయిక్యానందాభావామూ॥ వోవోయోగాగుమ్మా॥ చం
దామదియూ తెలుసూకున్నావూ॥ ౪॥ మరియూచూ కాణన్నోపలానపు
మూ ముద్రాకర్తానూజూచీయూ- రెండురేకూల పైనానిలచీయూ॥ వోవో
యోగాగుమ్మా॥ ఖండజ్యోతిని కలసీయున్నావూ॥ ౫॥ సతూ-- గాత మై
నాతనువూ మూలామేదోయెరిగీ నావూ- సుబ్బాగురుణీ కరుణా చాతా
మూ॥ వోవోయోగాగుమ్మా॥ సూక్ష్మసూక్ష్మము తెలుసూకున్నావూ॥ ౬॥

ఇట్లుపలికిన అకర్రపలుకులకు ఆనందించి ఆచెలి యిట్లనియె.

యాలలు.

సుబ్బాగురుణీ కరుణాయేనూ సూక్ష్మమూగా తెలుసూకోనీ - నిబ్బారముగా నిలచీచూడాగా॥ వోవోఅకర్రగారూ - అబ్బారముగా వారీచరణామూ॥ ౧॥ సుబ్బాగురుణీ కరుణాతో నాసూక్ష్మబిలమెచూడ. నాయె - సూక్ష్మమూలో సూక్ష్మమాయగా - వోవో అకార్రగారూ. సూక్ష్మసూక్ష్మము నీకేతెలుసూగా॥ ౨॥ సొంద్రాకాయూ బుర్రాలోనా సోహంమానే పలుకున్నాదీ - కీలుడెలిపేజ్ఞానూలరుదూగా- వోవో అకర్ర గారూ చాలుదప్పాకుండాచూడూమూ॥ ౩॥ ఆగ్రమెత్తీ తాగినవుడూ ఆరూమూడూ ఆకాశానా- ఆర్భటించీ అరువాసాగేనూ॥ వోవోఅకార్ర గారూ వున్నామాయావురకాసాగేనూ॥ ౪॥ నల్లాగున్నా నాతికోకార్ర తెల్లాగున్నా తేజీబుస్సై - తేజీనెక్కర దవ్వుడూగొట్టాగా - వోవో అకార్ర గారూ- దవుడుగొట్టై దారీదెలిశానూ॥ ౫॥ వకార్రమాటూతో నబోయీ- ప్రణవాపీఠామెక్కీరనపుడూ - నాల్గుదికూర్రల నాదామాయగా - వోవో అకార్రగారూ - కోటికొమ్మలు చదరామాయీగా॥ ౬॥ పుణ్యాస్త్రీలా నెంటాబెట్టూక-పూలాతోటె జూడబోతె - సాటీలేనీ బోటీదొరికెగా - వోవో - అకార్రగారూ సుందరాంగిని చూడనాయగా॥ ౭॥ జాతినీతీలేనీ చెట్టూ పూతాబూశీ ప్రబలామాయే - పిందెబుట్టీ ప్రియమూనొందెగా॥ వోవో॥ అకార్రగారూ - కాయగాశీ పండూపండేగా॥ ౮॥ వంటూపా కా మింటూనుండీ జంటూనాగస్వరమూలూదీ - వంటూపాకా మింటూశా యగా - వోవో అకార్రగారూ - కంటీద్రెష్టితో కలశీచూడాగా॥ ౯॥

గగగా మూలా మెరశీనపుడూ ఘంటా నాదమినికీడాయా - మింటచుక్కా లు మెరయా సాగేనూ॥ వోవో అక్కా గారూ దృక్కు దృశ్యము చూచీచూడాగా॥ ౧౦॥ కంటీమరుగూన చూచీనపుడే యింటీమరుగూ తెలిసిపోయా- అంటీమరిగీ రొంటేసందూనా॥ వోవో అక్క గారూ యింటిమరుగూ కంటా దెలిసెనూ॥ ౧౧॥ కూటాస్తానామూనూ దాటీ - పేటూ మీదీకెక్కీనపుడూ వెంటపిల్లా యేడ్వా సాగగా॥ వోవో అక్కగారూ - యెడ్చేదానీ బూడ్చిపెట్టీతీ॥ ౧౨॥ కోటానుంచీ ప్యాటాలోకి కోమాలాంగిని చూడబోతే నీమా మూతో నామామడిగేనూ॥ వోవో అక్కా గారూ నామనీమాము నీకే తెలుసునూ॥ ౧౩॥ నిజమూ నీచేననుచూ పాచా దాసీనైతీ భాక్తిమీరా శక్తికొలదీ శాయాదాణగితే॥ వోవో అక్కా గారూ - ముక్తి మార్గాము మున్నే కలిగేగా॥ ౧౪॥ కూసామిడచీ వేషామేశీ ఆశాపాశామూలు రోశీ నాశీకాగ్రామంగూ చూడాగా॥ వోవో అక్కా గారూ-ముక్తి కాంతా మురియూచుండెగా॥ ౧౫॥ కుందానంపూ బామ్మాతో నా కూడే ముచ్చాటాడేటటూ శాయవమ్మాయని చరణా మొందీతీ॥ వోవో అక్కా గారూ వేదూ కాంతో కోరీవేడీతీ॥ అక్కా॥

త్రిపుట॥ చెలియరో యాచిద్విలాసము-యింకయే మో బాగ చూడుమ- చూడవమ్మా ముక్తికాంతనుకూడవమ్మా॥ ౨౮౯॥ చూచివేడుక తరణమందున తెలుపుమీపువ్వాడు తేటతెలివిగా - వివరముగ దెలుపమ్మ చెల్లెలా విశదముగనూ॥ ౨౯౦॥ తామెరాకమలముకు సరియగు పాదముల బంగారు అందెలు పావడలు పాంజేలు గజ్జెలు కాళ్ళకమరీ॥ ౨౯౧॥ మెరుగుపెట్టిలు నిమ్మగుత్తులు బొబ్బిలికాయలు వ్రేళ్ళకమరీ - రత్నగద్దెపైన కొలువై యున్నదమ్మా॥ ౨౯౨॥ తళుకు వజ్రపు పాదుకలు పాదముల యున్నవి తళుకుమనుచూ - చూడనాకను నిలువజాలకా వెరచితమ్మా॥ ౨౯౩॥ సందిదండలు బాజిబందులు జారగా తాయత్తు ఖుగ్గలూ - హస్తముల కర కంకణంబులు - అందముగనూ॥ ౨౯౪॥ సరిగెబంగరు జంటరవికెపై మెరుగు మెరయా - హారములు సరీ పచ్చపదకము హెచ్చుసొమ్ములు - పణాతి కమరీ॥ ౨౯౫॥

ద్విపద - కాంభోజి.

శ్రీమించు సహస్రారకమలంబునందు । అక్కరో వినవమ్మ అముక్తికాంత । చిద్విలాసముమూఢ చిత్రమైతోచె । ముత్యాలకమ్మంగు ముని

బావిలీలు । రత్నాలుచెక్కిన రవిచంద్రవంక । జినుగైనబంగారు పాపట
బొట్టూ । నలుపైననుగురువాల్కీల్జడలమరి। జడలపై పువ్వులదండలుజెక్కి-
తీరైన తిలకము నొొదిటికినమరి। కెంపులుజెక్కినా కుందనపుసత్తూ । నాశి
కంబునజూడా నమరియున్నాదీ । మరకతమాణిక్య నీలగోమేధి । కంబులు
జెక్కిన హారముల్సరులు । వజ్రవైడూర్యముల్ పుష్యరాగంబు । లనువొ
ప్పి యురమున హారముల్తూగా । తూగుటుయ్యాలలపై తూగేదివూగ ।
పచ్చలుజెక్కిన పసిడికంకణములు । హస్తంబులనుమించి తళతళమెరయా।
కలువరేకులబోలు కన్నులుజూడ । పద్మినీపలువరస పదివేలుజేసు । జిగి
బిగి వగమోము తళుకుచెక్కిళ్ళూ కులుకుగుబ్బలపైన ముత్యాల సరులు
అగణించుబాహులు అమ్మకువొప్పి । నల్లశీమలబారు నెక్కినతీరుగను
వొప్పుచున్నదీ అమ్మనూగారు । నడుమువడ్డ్యాణంబున నయమైనచీర కలి
యపువ్వులరవికె కాంతకువొప్పి। అరిటిస్తంభముబోలు అమ్మపెందొడలు।
బిగువైనపిక్కలు మినమినమెరయ । చిగురాకుపాదముల చిరిగజ్జెలమరి ।
మెట్టెలు పిల్లెండ్లు నిమ్మపువ్వులను బొబ్బిడికాయలు వ్రేళ్ళకున । మరి కన
కంపు జిగిమించు కాంతికిహెచ్చి । సూక్ష్మదేహముతోన సుదతీలలామ
కమలంబునను నుంది కలకలనవుచూ॥ చెల్లెలు, అక్కా- ఆమహాదేవైన
ముక్తికాంత రూపురేఖ విభ్రమవిలాసంబుచూచినంతయు నాకుతోచినం
తయు నీకు తెలియజేసితివమ్మ అక్కగారూ॥ సుగిణి ముక్తికాంతను
కన్నులపండువుగాజూచితివా - చూచితినమ్మా - ఆముక్తి కాంతరూపు
రేఖ విభ్రమవిలాసం చూచినప్పుడు నీకణ్ణొనలద్రిష్టి యట్లా నిలిచె
నమ్మా - ఆమహా దేవైన ముక్తికాంతను చూచినప్పుడు కణ్ణొనలకు
మిర్రుమిట్లై దేహముపులకించి కంపాయమొంది చూపు చెదిరేటప్పుడు అ
ట్లు చెదరకుండా కణగవననచిపట్టి చూచితినమ్మా అక్కగారూ॥ అక్క॥
యెంత తెంపమ్మా నీమనస్సు యెంతగట్టిచేశినమ్మా సుగుణీ॥

దరువు - ఆది.

ఇనవేసుగుణీ తెలిపేదానూ మాయాప్రపంచ మర్మామూ - వి
ష్ణూమాయాలోనానరులూ- చిక్కిచోకూ-చున్నారమ్మా॥ యినవే॥ ౧॥
సాకారమునాసద్గూరూనీ మీదాభాక్తితోనుండీనా - మాత్రూగార్భా
మంమూబూట్టీ - నట్టీఫలమూయిటులాజేసూ॥ వినవే॥ ౨॥ విష్ణూయీశ్వా

రా బ్రహ్మయీ - మాయలో నాచికున్నారూ - మనుజూ లెంతోవార
మ్మాయీ - మాయాగడనూ । మనిసూనిల్వనూ॥ వినవే సుగుణి॥ 3॥

ద్విపద॥ అనియిట్లు అక్క తానానందమొంది । వోయమ్మ వినవే
నావొప్పులకుప్ప। నాప్రాణసఖివమ్మ నాముద్దుగుమ్మ । నన్నునమ్మినయట్టి
నాతివినవమ్మ । యిఘమేమియున్నదో వివరించిబాగ । చూడుము నీవిప్పు
డు చూడుమటన్నా॥

వచనం. అనియిట్లు అక్క చెల్లెలికి చెప్పుచున్న సమయమందున పద్మాక్షి ముక్తికాంతకు పూజాద్రవ్యములు తేవడానకు యత్నించెనట యెటువలెను. పద్మాక్షీ, నీలవేణీ యేమమ్మా పద్మాక్షీ మనముతోటకు బోయి పూజాద్రవ్యములు తెచ్చి ముక్తికాంతశిరోమణికి పూజశాయవలెగాని, త్వరగా జ్ఞానశిరోమణులందరిని తోడితేవమ్మా తోటకుబోవలెను. నీలవేణి, అట్లాగె తోడెతెచ్చెదనమ్మా పద్మాక్షీ త్వరగానే - నీలవేణి ॥ జ్ఞానశిరోమణులందరిని పిలుచుట. నారీమణి హంసయాన అమలాక్షీ జ్ఞానరత్నమా పావనచరితా యిందుముఖి మధురవాణి జ్ఞానసుందరీ పద్మావతీ జ్ఞానాంబా శిరోమణీ హేమాక్షీ సూర్యకాంత సూర్యముఖి అరుణ చిత్రమా జ్ఞానసుందరీ సుజ్ఞానస్వరూపిణీ లక్ష్మీకాంత బ్రహ్మకాంత విష్ణుకాంత అక్కమాంబా నీలావతీ నిమ్మకాంత హేమరత్నమా, మనమిందరము త్వరగా తోటకుబోయి పూజద్రవ్యములు తేవలెనట, పద్మాక్షియుత్తరవు అయినది పోదాము రారమ్మా హేమకాంతా, హేమకాంత అగత్యం అట్లాగెవస్తూయున్నామమ్మా నీలవేణీ, నీలవేణి పద్మాక్షీ జ్ఞానశిరోమణులందరు వస్తూయున్నారమ్మా. పద్మాక్షి రెండో యుత్తరవుజేయుట. నీలవేణి పద్మినిస్త్రీలు పైనమైవస్తూయున్నారంటివి, తడువైనది రాలేదు. నీవు త్వరగాబోయి వెంటనే తోడితేవమ్మా, నాయాజ్ఞమీరక నీలవేణీ జ్ఞానశిరోమణులను రెండోపరియాయము పిలుచుట.

దరువు - ఆది.

జ్ఞానశిరోమణులారా - రారె తోటకుబోవలె త్వరగా - నీలాంబా నిమ్మకాంతవో జ్ఞానరత్నమా జ్ఞానశిరోమణి జ్ఞానాంబా సూర్యకాంత వో॥ జ్ఞానశిరో॥ ౧॥ మల్లెలుమొల్లలు సన్నజాజులు సంపంగిపూలు పారుజాతములు - కాశిరత్నములు - కమ్మనిఫలములు- త్వరగాచెమ్మని యుత్తరువైనదీ॥ జ్ఞాన॥ ౨॥ అగత్యమొచ్చెదమమ్మా- మాకాంతకు పనియేమమ్మా॥

వచనం. జ్ఞానశిరోమణులు తోటకుపైనమై పోవుట.

దరువు - ఆది.

జ్ఞానశిరోమణులేగా - తోటకుపైనమైరివీరు బాగా - అందరుకేల్జడ లేశీ - జడపైగేదగి రేకులుముడిచీ - పట్టుచీరెలూగట్టీ - వనరుగవడ్డాణంబులుబెట్టీ - జినుగుబంగరూజంట రవికెపై ధళధళమెరిసే హారములేసుక - నొదుటతిలకమూ పాపటబొల్లుతో॥ జ్ఞాన॥ ౧॥ మరకతమాణిక్య నీలగోమేధిక- పుష్యరాగముల - పచ్చకెంపుతో - కుందనమేశిన - చెండుబట్టుకొని॥ జ్ఞాన॥ ౨॥ కాళ్లగజ్జలూగట్టినస్త్రీలూ - హస్తకంకణము లమరినస్త్రీలూ - బాజిబందులూబెట్టినస్త్రీలూ - ముత్యాలారములేసినస్త్రీలూ - ముశిముశినౌవులు నౌవేస్త్రీలూ - కాశిదట్టీలూ గట్టినస్త్రీలూ - అగరు గంధమూ అతివెలునలుముక - కోలహాలముగవాలలాడుచూ॥ జ్ఞాన॥ ౩॥ హేమకాంతరాండెమ్మా - శానా ఆలస్యమాయనెకొమ్మా - నీలవేణిపదవమ్మా - ఆలస్యమేమిలేదులేకొమ్మా - సుందరాంగనలు సుందరిమణులు అతిక చకోనీ అప్సర స్త్రీలు అందమైన యాచెండుబట్టుకొని - యెగరవేయుచూ అందిపట్టుచూ॥ జ్ఞాన॥ ౪॥ జ్ఞానశిరోమణులపుడూ వొచ్చిరి పద్మాక్షికడకపుడూ॥ ౫॥ హేమవర్ణపూ మొదవినసొమ్ములు - సరిగెబంగరూరవికెలుదొడిగీ - జారుపైయ్యెచా - జీరియాడగను భక్తిభావనలో బాగుగనిలిపీ॥ జ్ఞానశిరోమణు॥ నీలవేణి॥ పద్మాక్షి జ్ఞానశిరోమణులందరు వచ్చినారమ్మా - వచ్చినారా నీలవేణీ వచ్చినారమ్మా॥

పద్మాక్షి - దరువు - ఆదితాళము.

హేమకాంత యిటురమ్మా - యిపుడూతోటకు బోవలెకొమ్మా - ముఖ్యముగా మనముక్తికాంతకూ - పూలుపత్రియూ కురువేరుదవనము - మాసుపత్రియూ- మల్లెపుష్పములు-సంపంగిపువ్వులు చాలగదేవలే॥ హేమకాంత యిటురమ్మా॥ ఆమెమాటగైకొనీ - అపుడాతోటకుబోనూ పూనీ॥ హేమకాంత॥ పద్మాక్షీ - త్రివేణితోటకా- మహాద్వారముదగ్గరయుండె- సదాశివుగారితోటకా - సదాశివుగారితోటకెనమ్మా- త్రివేణితోటదూరం- యిపుడె ప్రొద్దెక్కినది. అయినా సదాశివుగారితోటలోనె పూలుపత్రి విశేషముగాయుండేది. అక్కడికె పోదాము పదండమ్మా - హేమరత్నమా॥

జ్ఞానశిరోమణులు తోటకుబోవుట.

దరువు - శంకరాభరణం - రూపకం.

పూలతోటకేగుదెంచిరి- పుణ్యాంగనాలూ - పూలుగోయమదినదలచిరి॥ పూలుగోయమదినదలచీ పుట్టచెండుచాతబట్టి- ఆడుకొనుచు పాడుకొనుచూ ఆత్మలో ఆనందపడుచూ॥ పూలతోట॥ ౧॥ పుణ్యవతులు పూట్టచెండూ చాతబట్టిగగనవీధి- కెగయుగొట్టిధరణిపైనా పడకమునుపెచాతదటుచూ॥ పూల॥ ౨॥ చెండుపైకియగరవేయుచూ- శృంగారచెండూ వాచ్చెవాని అందిపాట్టుచూ- అందిపాట్టిపొందికాతో అతివెలవ్రుడు శీఘ్రమూగా- చూడచూడ వేడుకాతో సూక్ష్మమతులు పూలుగోయా॥ పూలతోటకేగుదెంచిరి॥ ౩॥ పద్మాక్షి॥ యేమమ్మా చెంద్రముఖీ జాగుజేస్తిరి॥ యేమిజాగుచేస్తిమమ్మా పూలుపత్రికోస్తిరే కోస్తూవున్నాము కానాఆలశ్యంచేస్తిరే యిదుగోకోసుకోని వాస్తూవున్నామమ్మా యెవరెవరు యేమేమిదెచ్చినారు నేనుజాజిపూలు దెస్తినమ్మా నేను విరజాజిపూలు తెస్తినమ్మా నేనుపొగడపూలుదెస్తినమ్మా నేనుమల్లెపూలు తెస్తినమ్మా నేనుమొల్లపూలుతెస్తినమ్మా నేను చామంతిపూలు తెస్తినమ్మా నేనుతెల్లకల్వలు తెస్తినమ్మ - నేను యింద్రనీలపూలుతెస్తినమ్మా - నేను తుమ్మిపూలు తెస్తినమ్మా - నేను సంపంగిపూలు తెస్తినమ్మా - కాశిరత్నాలుతెస్తినమ్మా- నేను నిత్యమల్లెపూలుతెస్తినమ్మా- నేను దాసానపూలు తెస్తినమ్మా - నేను సన్నజాజులు తెస్తినమ్మా - నేను మరువంపుపూలు తెస్తినమ్మా - నేనుపారుజాతపుష్పములు తెస్తినమ్మా - నేను సువర్ణపుష్పములు తెస్తినమ్మా॥ పద్మాక్షి॥ చంద్రముఖీ- గేతంగిరేకులు తెచ్చినారా- తేలేదమ్మా యెంచేతతేలే - అక్కడ - సర్పములు వుంటూయున్నవని పోలేదమ్మా యెవరమ్మా- మీకుభయమైతే నేనే తెస్తానుగాని- పత్రి-యేమేమి తెచ్చినారు మారేడుపత్రి మాసుపత్రి దవనము కురువేరు రుద్రజడపత్రి మరువంపుపత్రి తొలిశిపత్రి కొవ్వేరీ కాశీదళాలుతెచ్చినామమ్మా॥ పద్మాక్షి॥ చంద్రముఖీ పూలు యందరుతెచ్చినారూ - పత్రి - యందరుతెచ్చినారు - పదివేనుమందిపూలు - తొమ్మిదిమందిపత్రి - తెచ్చినామమ్మపద్మాక్షీ॥ అయితే పదండమ్మా - పూజవేళమీరిపోయనూ॥ సూర్యముఖి చంద్రముఖీ నేనిక్కడపెట్టిన మరువంపుపూలు- కొద్దిగాయున్నవి. ఏమమ్మా,- యేమోనమ్మా నాకుతెలియదు. నారీమణి॥ చంద్రముఖీ సూర్యముఖి యేమో అంటూ

యున్నది. ఏమమ్మా ఆయమకోసుకున్న మరువంపుపూలు కొద్దిగాయున్న వని అంటూయున్నదమ్మా యేమో అమ్మా॥ యెవరుతీసుకున్నారో॥జ్ఞాన రత్నము॥ యెవరుతీసుకున్నా ఆముక్తికాంత శిరోమణికిపూజజేసేదే లేదే అవవాకండీ॥ పద్మాక్షి॥ యేమమ్మ సందడిచేస్తూయున్నారూ యేమీసంద డిచేయలే వస్తూయున్నామమ్మా॥

భక్తాదులు ముక్తికాంతకు పూజాద్రవ్యంబులు తీసుకొనివచ్చుట.

దరువు - రూపకము.

జ్ఞానమతులు అరుగుదెంచిరీ - ఆముక్తికాంతాపూజవేళకె దిగి వచ్చిరీ॥ దవనము తోవేరి మంచీ - పూలుపత్రి పండ్లుఫలమూ - దండీగా ను తీసుకోనీ - ధవళశంఖులూచుకొనుచూ॥ జ్ఞాన॥ ౧॥ పొన్నపూలు పొగ డపూలూ - బొండుమల్లెలు - నిత్యమల్లెలు- తుమ్మిపూలు గోసుకోనీ తీవ్ర ముగా పుణ్యస్త్రీలు॥ జ్ఞాన॥౨॥ మల్లెపూలు మొల్లపూలూ పారుజాతపుష్ప మూలూ - హాసుపాత్రి గోసుకోనీ నుగువలపుడు మహాభక్తితో॥ జ్ఞాన॥ ఇట్లొచ్చుచున్నసమయమందున॥ అక్క॥చెల్లెలితో యిట్లనియె. జ్ఞానస్వరూ పిణీ - సుగిణీ - ఆముక్తికాంత చిద్విలాసంచూచి చెప్పమని విన్నవించితి- నాకేమీ చెప్పలేదే॥ చెల్లెలు॥ చిత్తం అట్లాగె చెప్పెదవమ్మా అక్కా గా రూ - కోపముశాయవద్దు - శరణార్తి - అనిచెల్లెలు యోగముజూచి - అక్కకు చెప్పదొణిగె॥ ముక్తికాంతపూజాభరణము.

ద్విపద॥ అనిన విని ఆచెలి అతినిష్టలోనా । కమలంబుననుజూడ । కన్నతల్లికినీ - కస్తూరితిలకము దిద్దేటివారు । పట్టుగొడుగులుపైన బట్టేటి వారూ । భూచక్రగొడుగులు పట్టున్నవారు । వింజామరుల్బట్టి వీచెటి వారు । సన్నజాజులుపైన జల్లేటివారు। కన్నతల్లికిపాదములు వొత్తువారు చిత్తముబుద్ధేనుచు సేవించువారు । లక్షుమైదీపముల్ వెలిగించువారు । పం చారతిబట్టి పాడేటివారు । అమ్మముందర ఆటలు ఆడేటివారు । సారంగ చేబట్టి చదివెడువారు । హెచ్చైనభక్తితో వెడేటివారు । ముక్తికాంతను జూచి మురిసేటివారు । నారదతుంబురుల్ నయమొప్పమీర । వీణమీటుచు పాట బాడెటివారు । సిద్ధావిద్యాధరుల్ కీర్తనసేయ । గరుడగంధర్వులు సిరిగ జైకట్టి । అమ్మముందరనాట్యములుసేయువారూ॥

భక్తాదులు ముక్తికాంతకు పూజజేసేవిధానము.

ద్విపద॥ సంపంగిపూవ్వులు సన్నజాజులును। పూబోణులును దెచ్చి పూజింపువారు । అత్తరుపన్నీరు పునుగుజవ్వాజి। ఆముక్తికాంతకు పూజ జేసెటివారు । అగరుగంధముమేన । నలదెటివారు । మల్లెలుమొల్లలు మరి జాజిపూలు హారంబులుగ గూర్చి వేసేటివారు చామంతిదండలు చెన్నుమీర గను । ముక్తికాంతకు మెడనధరియించువారు । సువర్ణపుష్పముల్ దాసా నపూలు । చేతులకందించి శరణనువారు । పారుజాతంబులు పణతులు దెచ్చి । కాంతశిరమున బెట్టి ధ్యానించువారు । పొగడపూవ్వులు మంచి మల్లెపుష్పములు । కాంతయురమున బెట్టి - చెయ్యి వొగ్గేటివారు । నిత్య మల్లెలు మధ్యానమల్లెలును । నేర్పుతో నెలతలు పూజింపువారు । నీలంపు పుష్పముల్ కాశిరత్నాలు । శిరమున యురమున । పాదంబులకును పూజ జేయుచుభక్తి పెంపొందువారు । తుమ్మిపూవ్వుల పూజజేసేటివారు । గేదంగిరేకులు ముడిచెటివారు । ముత్యాలహారముల్ సవరించువారు। మరు వంపుపత్రియు మాసుపత్రియును । మారేడుపత్రియు రుద్రజడపత్రి । కురు వేరు దవనము కొవ్వేరిదెచ్చి । భక్తశిరోమణుల్ బాగుగానపుడు । శిరము యురమున । బాగధరియించువారు । పాదారవిందములపై బెట్టువారు మంత్రధ్యాన్నముచేసి మహాభక్తితోన । నిష్టాగరిష్టతో । నెగడెటివారు। ద్వాదశమంత్రంబు ప్రణవద్వాదశియు । ఓంకారమంత్రంబు వర్ణించువా రు అంజూర ఫలములు అరటిఫలములును । మరినిమ్మఫలములు । మాదెఫల ములు । వేరుపనసయు మంచి రామాఫలాలు। యిటువంటిఫలములు యిం పుతో దెచ్చి । ఆముక్తికాంతకు అర్పించువారు । ఆత్మమంత్రము ఆత్మను తియించువారు । సొమ్మసిల్లుచు । సోహమని పలుకువారు । ఓంకారశక్తి ని వర్ణించువారు। సాంబ్రాణిధూపముల్ వేసేటివారు ఏకార్తిముట్టించి వెలిగించువారు । పసులొత్తి దీటిలుపట్టెటివారు । ముత్యాలగొడుగులు ముందరబట్టి । చెన్నుమీరగశౌరి వేసేటివారు । మత్తేభములబట్టి భేరివా యించి । ఆనందపదవితో ఆడెటివారు । పంచాక్షరీవాక్య పఠియించు వారు । స్థూలపంచాక్షరీ । సూక్ష్మపంచాక్షరీ అయిక్యపంచాక్షరీ। ప్రసా దపంచాక్షరీ । గురుప్రసాదపంచాక్షరీ । మూలపంచాక్షరీ । పాతాళభేది యను పరమమంత్రములు । షోడశమంత్రంబు సోహమనెపలుకు । వీర శైవులు మంచివీరపుంగవులు । ప్రణవగణములుమంచి పరమభక్తులును । ఘోరపాప ఘాత్మలోతలచేటివారు। సాకెమసద్భక్తి సలిపెటివారు। సాధు

సత్పురుషులు । సన్నమేళముతో । షోడశవిధుల పూజింపువారు । మొగసాలఘంటయు మ్రోయించువారు । మద్దెలతాళములు వాయించువారు । ఖన ఖన కంచునగారలుగొట్టువారు। అటువంటి మహాత్ముల అమ్మయిజూచి। చిరునవ్వునవ్వుచూ సిద్ధులజూచి। వాలుగన్నులతోన భక్తులజూచి। కల కలనవ్వేటి కాంతలజూచి। పాటలుబాడేటి పణతులజూచి। భక్తితోయుండేటి భామలజూచి। నిష్టతోయుండేటి నెలతలజూచి సేవించుచుండేటి చేడెలజూచి ఆనందమునుబొంది ఆముక్తికాంత। వేయినూరు శిరములమొద్దపైనుండి। ఆనందపదవిలో అలరుచునుండి యుప్పొంగి ఆత్మలో పూహించి యపుడు। వామభాగమునుండె। అమ్మయుపురుష । భాగంబునకుతిరిగి తేజరిల్లుచును। గురుమూర్తినటుజూచికిలకిలనవ్వి। చేతులుజోడించి దండమర్పించి। శరణార్థిగైకొని చేకొనియిపుడు। మనవియొకటివినుము మద్గురుదేవ। మద్గురుసేవించి మాయలువిడచి। గురుమంత్రమాత్మలో గురుతుగానిలిపి । శ్రీపురుషులునుయిటుల చిత్తంబునిలిపి । సత్తునుసాధించి సద్గురుకృపను । యుత్తమపురుషులై నుర్విలోమెలగి। కాననికలిమిచే బలిమిచేవారు। భాగ్యంబుగైకొని భావంబులోన । యోగంబుననుజూచి వేగమేయిటకు । వొచ్చి వారిపుడూ। అమృతంబుగ్రోలి। ఆనందపదవిలో ఆడుచున్నారు। నీమహిమ యేమయ్యా నిఖిలలోకములా॥

తోరా॥ శ్రీగురుదేవా శ్రీగురుదేవా శ్రీగురుదేవాయనుచూ- మోక్షదాతనామొరాలించి-యానంది దెలుపుమనుచూ॥ శ్రీ॥ సద్గురుస్వామే తల్లితండ్రియని చాలభక్తులంతా-నిజముదెలుసుకొని- నిష్టలుబొగడి-నిన్నునమ్మిరంతా॥ శ్రీ॥ కాననికలిమిచే బలిమిచేవారు బాగుమీరగానూ- అమృతముగ్రోలి అలరుచున్నరు ఆనందముతోనూ॥ శ్రీగురు॥

వచనం. అని యిట్లు పలికిన ముక్తికాంత మృదువాక్యములకు సంతోషించి ఆనందభరితుడై సద్గురుస్వామి యిట్లనియె॥

తోహర॥ ముక్తికాంత వోముక్తికాంత వోముక్తికాంతవినుమా- కాంతామణి నాభక్తుల మహాత్మ్యము వివరించను తరమా॥ ముక్తికాంత వో॥ విష్ణు ఈశ్వర బ్రహ్మకునైన అలివిగాని దమ్మా - స్వానుభావమది - నైయ్యమయోగము స్వాంతముగా కొమ్మా॥ ముక్తి॥ అమ్మరోవిను నా భక్తులమహాత్మ్యము - నీకుదెలుసునమ్మా - యట్లన్నను విను వివరించెదనీకే మకతోకొమ్మా॥ ముక్తికాంతవో ముక్తికాంతవో॥

ద్విపద॥ అని యిట్లు వద్గురు ఆనందమొంది। మదిలోనవుప్పొంగి పు
ష్పకుస్వామి। అమ్మరో వినవమ్మ నాభక్తకోటి। మహాత్యంబు తెలియను
అజునికివశమే। నూతి లోపులలోతు చొచ్చికనవచ్చు పిచ్చలవిడిగాను వి
హరించవచ్చు పచ్చవిల్తునిబారి గడువంగ వచ్చు। తెలియంగరాదు నా
భక్తుల మహిమ। విష్ణు ఈశ్వరబ్రహ్మసుర రాజులకైన। అమ్మలోనీవుజగక్
న్మాతవు గనుక। నీకెదెలిసెను నాభక్తుల మ హి మ। నా యం త
దానవే నా య మ్మ నీ వు। నీయందున నేను నాయందున నీవు
యేకీభవించి మన సాకాటిజేసి యెల్లలోకములందు వెలుగుచున్నా
ము। యెటులనంటేను యెగిరింతు వినుము। అంటిదామెర నీరు అం
టకున్నట్లు మంటి। కుమ్మరపురుగునంటకున్నట్లు ముత్యాలహారములో ధా
రమున్నట్లు। పాలలోపులఘృతము ప్రబలియున్నట్లు। ఆత్మలోపల మనము
అంటిఅంటకను। కల్లయుగములలోన కలశికలయకను। యీరీతి నుందు
ము। యిలప్రపంచమున। యిందునందును జూడ సందులేకెపుడు సర్వజా
తులయందు వుండివుండకను యీరేడుజగముల యీరీతిమనము ముదముతో
యుందుమే ముక్తికాంతనిన। గురుమూర్తి పలుకులకు ఆనందమొంది। ఆత్మ
సంతోషించిఆముక్తికాంత। పురుషభాగంబునదిరిగినయట్టి। అమ్మయువామ
భాగంబుకుతిరిగి। పరమపురుషులజూచి కిలకిలనవ్వి। సద్భక్తులనుజూచి సం
తోషమొంది। నాదికుజూచెనెనాయమ్మయనుచు। అనియిట్లుఆచెలి అక్క
తోబలుక - చెలియపలుకులకాత్మసంతోషమంది। కలికిరోవినవమ్మ కపురం
పుబొమ్మ।నీపుణ్యమేమమ్మనిజయోగగుమ్మ।భక్తితోవినవమ్మబంగారుబొమ్మ
చూచినకాంతనుచూచినీవిపుడు కలయుముతరణమే। కలయుమటంచూ॥
అక్క॥ జ్ఞానస్వరూపిణి। సుగిణి। సహస్రారకమలమందున్న ముక్తికాంత
శిరోమణి భోగమునీవుకన్నుల! పండువుగాచూచితివిగదా। చూచితినమ్మా
అక్కగారూ సుగిణీ, యింతకంటె వైభవ మిఖలేమున్నదమ్మా నీవుత్వర
గా ముక్తికాంతను కలయవమ్మా॥ చెల్లెలు॥ అక్కగారూ ఆముక్తికాంత
మహాదేవిని యెట్లాకలయుదు, యేమని సేవింతు- వారిభోగము చూడగా
కన్నులకు మిర్రుమిల్లులై దేహము కంపాయమానముజెందియున్నదీ ఆ
మహాదేవిని కలసెనేర్పేమొ ఆకారణము త్వరగా తెలియజేయుమని విన్న
వింతును॥ అక్క॥ సుగిణీ- అమ్మమంత్రముజిహ్వనదుడువుచూ శీఘ్రముగా
పోయి చేతులుగట్టుకొని భృత్యురాలవై సూర్యకిరణములు నేత్రములకు

ధరియించుకొని దృక్కుకన్నొసలయందుయుంచుకొని హంసలనెగయ దోలీ పవనమూర్తిని నిలగట్టి సుచిర్యాతురాలవై వారియెదట నిలచియుండు మెవ్వరు యీయోగకాంతని వారే నిన్నుయుచ్చరించెదరు తరువాత నీవు వారితో భాషణశాయవమ్మా అనిన అక్కనమస్కరించి చెల్లెలు యిట్లనియె.

దండకము.

శ్రీవేగమేపోవమ్మ- ఆభోగమేసొమ్ము-అనియిట్లుఅక్కయున్- చెప్పగా చెల్లెలున్ - వోయమ్మ ఆకాంత నేనెట్లచూచెదన్ - ఆధారమందున్న ఆచారలింగంబునన్- చూడమనిచెప్పినాచూచినన్- నీయాజ్ఞమీరకన్-చిత్తమున్-పొర్లకన్-ఆధారమందున్న ఆచారలింగమున కార్యానారుఅర్పించి - క్రియాశక్తినిన్ దరిశించి-యోచించి- ఆపైన- స్వాధిష్టమున్ జేరి- గురులింగమూర్తికిన్- యార్వేలుఅర్పించి జ్ఞానశక్తినిన్ సేవించి భావించి- అందుండి ఆపైని-మణిపూరకముజేరి శివలింగమూర్తికిన్ యార్వేలు అర్పించి - యిచ్ఛాశక్తిన్- సేవించి-మున్మ్మంటరాకమ్మయాయమ్మ వోయమ్మ - అని దండమర్పించి-అందుండె ఆపైనఅనాహతంనందేగమేచేరి- శరలింగమూర్తికిన్-యాబరమహంసలన్-యార్వేలు అర్పించి-ఆదిశక్తినిన్ దరిశించి ఆమెకున్ దండప్రణామంబు లర్పించి - అందుండి ఆపైన యీశుద్ధమున్ జేరి। ప్రేమయున్ - మీరగా - భక్తియున్ జేరగా - ప్రేమతో పెంపలర ప్రసాదమూర్తికిన్ - పదినూరు అర్పించి - పరాశక్తినిన్ సేవించి - ఆయమ్మకున్ మ్రొక్కి అందుండి ఆపైన త్రివేణికిన్బోయి ముప్వేటిలో మునిగి - స్నానంబునున్ జేశి నిలచుండగా - ఆయీడపింగళుల్ జతగూడి సరస్వతి పునుగు జవ్వాజి యాఫూలదండలున్ దెచ్చి - మెడన్ వేశియన్- యాయగరు గంధమున్- పునుగుజవ్వాజియున్ గొప్పగామెప్పగా- మేనంటి బూశియున్- యుండగా- వారికిన్ నేదండమర్పించి- అందుండిఆపైన ఆజ్ఞేయమున్జేరి-ఆసదాశివమూర్తి కర్పించి - దశ-శతం - ఆద్వారమున్ దాటి సహస్రారమున్ జేరి- కోటిసూర్యప్రభాలీలతో యున్నట్టి-సద్గురు స్వామికిన్ దశశతంబర్పించి-నేకమలపద్మముల్ మొక్కియున్ స్రొక్కియున్- ఆకాంతనుంజూచి ఆనందమునుబొంది- ఆయోగభావమున్- ఆచిద్విలాసమున్ చూచినేచెప్పగా- చూడమనికాంతనున్- కూడమనిచెప్తివిన్ నేనెట్లా కూడెదన్- ఆకాంతనే డెదన్- నాపట్లదయవుంచినన్నేలి రక్షింపుమనుచు నిన్నేడితిన్- సొంపుగాకోరితిన్। కోరినా కోర్కెయున్ కొనసాగ

నివ్వవే- జగజ్జనని- యనమదులవారింటనే పుత్రిరత్నమై- పుట్టియుక్ ఘట్టి గా- నాపూర్వకృతముచే-నాపుణ్యఫలమునక్-ఆవిశ్వబ్రహ్మాన-సుబ్బగురు స్వామినిక్-దరిశించి సేవించి వారికిక్-పదివేలవందనక్-భక్తితో అర్పించి వారికరుణాకటాక్ష-వీక్షణంబునక్- యీగొప్పనేర్పుచే చెప్పితిక్ నేచిన్న దండకంబౌకొ-టిక్ తప్పున్న చూడమని పెద్దలక్ వేడితిక్ యీగుణకభావం బు యీతత్వమహాత్యంబు కొద్దిగా జెప్పెనని కోపంబుశాయకక్ - నామీద దయయుంచి నన్నేలిరక్షించి-ఆనందమొందవేవో యమ్మ శారదాకల్పవల్లి- కీరవాణీ- జగన్మాత-జగన్మోహిని మముబ్రోవవే యీశ్వరీ నమస్తే నమస్తేనమః॥

చెల్లెలు॥ అకా-నామనవి చిత్తగించి నామీదదయయుంచి నామొ రాలించు. భూలోకమనే ఆధారం, భువర్లోకమనె స్వాదిష్టం, సువర్లోక మనె మణిపూరకం మహర్లోకమనె అనాహతం మర్థ్యలోకమనె విశుద్ధం తపోలోకమనె ఆజ్ఞేయం యీకమలములయందు యెక్కి- వాకొ-కకమల మందున్న మహాదేవునికి పూజజేయుచూ గంగాసరస్వతి గవిఅనె అమ్మ గారిని సేవించి త్రివేణిగడచి మహా ద్వార ము గ డ చి సూర్యమం డలముదాటి సత్యలోకమనె సహస్రారానికి పోయి - ఆమహాదేవుడై సద్గు రుస్వామికి- పూజచేశి- ముక్తికాంతను దరిశించి- అందున్న చిద్విలాసం- ఆమహాదేవి వైభవం చూచినీకుచెప్పగ త్వరగా ఆకాంతను కలయుమని చప్పడానకు- నామనసుకు అనుమానముగా వున్నది. మీమనస్సునెందు క లితమిడచి వున్నభావం ఆమెను కలిశెవిధాయకం త్వరగా చెప్పుమని ప్రా ర్థించెద॥

ద్విపద॥ కాంభోజి॥ శ్రీమించు సహస్రారమందున్న కాంత నెటువ లెకలయుదు యెటుల శేవింతు। అకరో యేమమ్మ యిటులబలికితివి కలశే టి నేర్పేమొకారణంబేమొ పూర్ణదయతో నీవుశలవిచ్చియిపుడు। చెప్పుము శరణమే చెప్పుమటన్న। అనినవిని అకయు ఆనందమొంది శ్రీసత్యసద్గుణీ శృంగారవాణి। సద్గురునమ్మినసద్గుణివనుచు । యీమెకీమర్మంబు జెప్పంగ వలయుఅని యిట్లు అకయు। ఆత్మవూహించి। పొంగుచు ఆచెలిభక్తికి మెచ్చి చెలియరో వినవమ్మ చెప్పెదనీకు। నీవునేననియేటి భావంబువిడచి నీవు యేనొకమైన నిజయోగ గుమ్మ కలుతువు కాంతను శేవింతువమ్మ। చేతులు మొకుశించి శరణుశరణనుచు। శరణుజొచ్చినవనిన్ను సేవకివనుచు । చేకొని

రక్షించుచెన్నుమీరగను। అమృతంబుయిచ్చునుఅమ్మనీకనిన । అనియిట్లుబలికినఅక్కడయుతాను। కాలవహ్నినలకరగరగినయెట్లు। పాలలోపులనీరుకలశియున్నట్లు। పరమాత్ముడంతటనిండియున్నట్లు । ముత్యపుచిప్పలో బిందుపడినట్లు। పరశవేధినలోహమేమించినట్లు । రసమురసమునగూడి రంజిల్లిచున్నట్లు। కర్పూరంపుజ్యోతిగలశియున్నట్లు।కలశితామిద్దరుకలకలనవ్విధిక స్వరూపమైఆయోగకున్న। అమ్మమంత్రముఆత్మనుతియించుకొనుచు। చేతులుముకుళించిశరణుశరణనుచు। కడువేగమునబోయికన్నతల్లెదుట । నిలచున్నచెలియనునిష్టతోజూచి। ఆనందమునుబొందిఆముక్తికాంత। కన్నులకలికియీకాంతయవరనుచు। నన్నుకొనియాడేటినాతియవరనుచు । పూలదండలుమేడనవునుగుజవ్వాజి। యేశిపూశినయెట్టి కొమ్మయవరనుచు । అరుదంది ఆత్మలో ఆముక్తికాంత । మురియుచుముదితతో మదమొప్పబలికె॥ ముక్తికాంత॥ పద్మాక్షీ యేమమ్మామహాదేవి ॥ శరణార్థి హేమకాంత॥ జ్ఞానరత్నము నీవు మీముఖ్వరుబోయి ఆభక్తురాలుయవ్వరో విచారించండమ్మా త్వరగాబోయి యేదమ్మా ఆమెయక్కడవున్నది నాయకటనెఅదోఅక్కడ అవునె తపశిగావున్నదే అమ్మా. అమ్మానీవెవరు అమ్మానీవెవరైనది అడగమని ముక్తికాంతశిరోమణిశలవైనది యవరమ్మానీవు॥ పద్మాక్షి॥ హేమకాంతా యేమమ్మజ్ఞానరత్నమా, యీమెతపశిగా వున్నదే పదేపదే హెచ్చరించితే తపోభంగమానోయేమొ యీసమాచారము అమ్మగారికి తెలియజేస్తాము పా ॥ పద్మాక్షి॥ అమ్మ రాజరాజేశ్వరీ త్రిలోకసుందరీ ఆదిశక్తి భక్తరక్షణీ భక్తపోషణీ ముక్తికాంతశిరోమణిశరణార్థి మేముఅక్కడికిపోయ్యివుంటిమి॥ ముక్తికాంత॥ యేమిసమాచారము. యేమిసమాచారములేదమ్మా ఆమెనేత్రములుమూసుకొని ఆమెమొకుల నీమీదనే పెట్టుకొని మంత్రధ్యానముచేస్తూ సుచిర్భూతురాలై నిష్టాగరిష్టత్వముచాత వున్నది మేమక్కడికిపోయి మూడుమార్లువుచ్చరించితిమి ఆమెపలకలే విశేషముగా హెచ్చరించిసందడిచేస్తే యేమొననిభయముచాతమేమువస్తిమమ్మా మహాదేవి శరణార్థి॥ ముక్తికాంత॥ మంచిదిగురుత్వముగావొచ్చినది మంచిపని॥ ముక్తికాంత యోగ గుమ్మను వుచ్చరించుట. హేమకాంతా యేమమ్మా పన్నీరుబుడ్డి త్వరగాతీసుకరావమ్మా తెచ్చినామమ్మా ఆపన్నీరు నాచేతిలో త్వరగాయింతపోయవమ్మా, ఆపోశినపన్నీరుముక్తికాంతయోగగుమ్మ ముఖముమీదచల్లి యోగకప్పు విడిపించి ఆమెసవిస్తారము అడుగుట. యువ

రమ్మా నీవుయికకుడికి యట్లా వొచ్చినావు నీగురువు యవరు వారిపేరేమి నీపేరేమి నామంత్రధ్యానము జిహ్వానుడువుచు చూటికన్నానలయందునిలిపి నిష్ఠాగరిష్టత్వముచాత శుచిర్భూతురాలవై యున్నావు యవరమ్మా నీవు త్వరగా చెప్పవమ్మా.

ముక్తికాంత యోగగుమ్మ సంవాదము యాలలు.

యవ్వారమ్మా మగువానీవూ యెటులావొచ్చినావూయిటులా- సఖియరోనీపేరూ దెలుపావె॥ కస్తూరితిలకా కారణామూ నాకూ దెలుపావె॥ ౧॥ అమ్మావినువోముక్తికాంతా ఆరుస్తానామూలూదాటీ - అలశీవొచ్చితీనేయిచ్చటికీ॥ వోవోముక్తికాంతా॥ నాదుపేరూయోగాగుమ్మాగా॥ ౨॥ యోగాగుమ్మావై తెనీవూ యేమీయేమీ నేర్చినావో - వేటిఁమీరానాకూ దెలుపావే - వోవో యోగాగుమ్మా॥ సరకు శాయక కలికీపలుకావే॥ ౩॥ ఆరుస్థానామూలూదాటే నేర్పుదెలశీ వోర్పూగలిగీ - నీమామతో నిన్ను జూచీతీ॥ వోవోముక్తికాంతా॥ నిజముగానే నిన్నుకలశీతీ॥ ౪॥ ఆరుస్థానామూలూదాటే నేర్పూయవడూ దెలిపేనీకూ - ముడుపుముద్రా నాకూ దెలుపావే॥ వోవో యోగాగుమ్మా॥ కలకలేనీపలుకూపలకావే॥ ౫॥ తనుపూధనమూ మనమూనేనూ గురుమూర్తికి దారాబోశీ - గురుణిచాతా తెలుసూకుంటీని- వోవోముక్తికాంతా॥ గురుతుగానే యిచ్చటికొస్తినీ॥ ౬॥ గురున్పూచాతా తెలుసూకుంటే ఆరూస్థానాములలోయున్న- హంసపగిది నాకూదెలుపావే॥ వోవోయోగాగుమ్మా॥ ఆలశించక చాలాదెలపావె॥ ౭॥ అమ్మావినవేముక్తికాంతా ఆధారాస్థానామూనందూ- నాలుగురేకుల కమలముండూను॥ వోవోముక్తికాంతా॥ ఓంఅనినడమపవనూ డమరీయుండూనూ॥ ౮॥ నాల్గూరేకూల కమలామందూ నడమాపవను డమరీయుండీ- యెందుయెందూ సంచారించూనే॥ వోవో యోగాగుమ్మా॥ యోగమందే యెరుకా పరచావే॥ ౯॥ ఆధారస్థానమూ నందూ కమలమందూ నడమాయుండీ- పావనుడూ సంచారించూనూ॥ వోవో ముక్తికాంతా॥ ఆరునూరూహంసాలైనాదీ॥ ౧౦॥

ముక్తికాంత॥ యోగగుమ్మా యేమమ్మా మహాదేవీ, ఆధారస్థానమందు ఆరునూరుహంసలుఆడేటప్పుడు ఆసమయమందునయే దేవునికెపూజ జేసినావో చప్పవమ్మా॥ యోగగుమ్మ॥ అమ్మా ఆధారస్తానమందు అరు

నూరుహంసలు ఆడేటప్పుడు పవనమూర్తైనగణపతికి పూజచేశినానమ్మా పూలుపత్త్రెరతో మంచిది అట్లయితె సంతోషమేనమ్మా॥

యాలలు॥ ఆధారాకమలామూనందూ - ఆరునూరై సంచరించీ - అందునుంచీయెందూబోవూనే-వోవోయోగగుమ్మా - వేడుకాత్తో నాకూ దెలుపావే॥ ౧౧॥ ఆధారాకమలామూనందూ - ఆరూనూరై సంచారించీ॥ హంసుడు- రెండుఅంగుళాలు- సొంపుతోస్వాధిష్టామెకూర్ నే॥వోవో ముక్తికాంతా- సోహమనుచూ పలుకూచుండూనే॥ ౧౨॥ సోహమనుచూ పలుకుకూచుండీ - స్వాధీష్ఠానాయెటులాయుండూ - సోధజేశీనాకూదెలుపావే॥ వోవోయోగాగుమ్మా- సొంపుతోనా యిందూదెలుపావే॥ ౧౩॥ అమ్మావినవే ముక్తికాంతా-స్వాధీష్ఠాస్థానామూనందూ - ఆరుదళమూలకమలాముండూనే॥ వోవోముక్తికాంతా- నడమూపవనూడాడూచుండూనే॥౧౪॥ ఆరూదళమూలకమలామందూ - ఆడూచుండీ పావానూడూ - పరగయెందూ సంచారించూనే-వోవోయోగగుమ్మా- చెన్నుమీరానాకూ దెలుపావే॥ ౧౫॥ ఆరూదళమూలకమలామందూ- ఆరూవేలూ ఆడూచుండీ- కోణమందే సంచారించూనే - వోవోముక్తికాంతా - హంసుడూ ఆ విధమూ ఆడూనే॥౧౬॥ ముక్తికాంత॥ యోగగుమ్మా-యేమమ్మా- మహాదేవి॥ ముక్తికాంత॥ స్వాధిష్టస్థానమందున-ఆరువేలుహంసలు ఆడేటప్పుడు ఆసమయమందున యేదేవునికి పూజచేసినావో చెప్పవమ్మా॥యోగగుమ్మ॥ అమ్మా స్వాధిష్టస్థానమందున ఆరువేలు ఆడేటప్పుడు ఆసృష్టికర్తైన బ్రహ్మకు పూజచేసినానమ్మా- పూలుపత్రితో॥ ముక్తికాంత॥ యేమంత్రముచేత పూజచేసినావు బ్రహ్మకు॥ యోగగుమ్మ॥ స్థూలపంచాక్షరిచేత పూజచేసినానమ్మా - మహాదేవి॥ ముక్తికాంత॥ ఆహాబ్రహ్మసామ్మనె అది-నాకు సంతోషమాయ॥

యాలలు॥ ఆరూదళమూలకమలామందూ- ఆరువేలూ ఆడీఅతడూ- అందునుంచీయేందూబోవూనే॥ వోవో యోగగుమ్మా - సంధియేమోనాకూదెలుపావే॥౧౭॥ ఆరూదళమూలకమలామందూ ఆరూవేలూ ఆడీయతనూ-అంసుడు యెన్మిదిఅంగుళములు - మమతతో మణిపూరకమెకూర్ నే - వోవోముక్తికాంతా-హంసుడు ఆవిధముఆడూనే॥ ౧౮॥ హంసూడూ ఆ విధమూఆడి-పూరాకమునాయెటులాయుండూ- పుణ్యావతిరో బాగాదెలుపావే॥ వోవోయోగగుమ్మా-వెలదిరో ఆసొబగూదెలుపావే॥౧౯॥అమ్మా

వినవే ముక్తికాంతా- మణిపూరాకాస్తానామందూ॥ వీరముద్ర॥ పదియు దళమూల కమలాముండూనే- వోవో ముక్తికాంతా- నడమపవనూడాడూచుండూనే॥౨౦॥ పదియూదళమూల పద్మామందూ-పావానూడూ ఆడూచుండీ-పరగనెందూసంచారించూనే- వోవోయోగాగుమ్మా- యించుకా ఆవిధమూదెలుపావే॥౨౧॥ పదియూదళమూల పద్మామందు- ఆరూవేలూ ఆడీఅతనూ- పద్మమూలో సంచారించూనే॥ వోవో ముక్తికాంతా-హంసుడూ ఆవిధమూనుండూనే॥౨౨॥ ముక్తికాంత॥ యోగగుమ్మా-యేమమ్మా మహాదేవీ-మణిపూరకస్తానమందున-ఆరువేలహంసలు-ఆడేటప్పుడు- ఆసమయమందున- యేదేవునికి పూజచేసినావో చెప్పవమ్మా॥ యోగగుమ్మ॥ అమ్మా మణిపూరకస్తానమందున-ఆరువేలు ఆడేటప్పుడు-ఆవిష్ణుమూర్తైన-మహాదేవునికి-పూజచేసినానమ్మా- పూలుపత్రితో॥ ముక్తికాంత॥ యేమంత్రముచేత పూజచేసినావు-విష్ణుకు॥ యోగగుమ్మ॥ సూక్ష్మపంచాక్షరిచేత పూజచేసినానమ్మా- మహాదేవి॥ ముక్తికాంత॥ఆహావిష్ణుమూర్తి సామ్మేనె అది నాకు సంతోషమాయె॥

యాలలు॥ పదియూదళమూల పద్మామందూ-ఆరువేలా ఆడేఅతనూ - అందునుంచీయెందూబోపూనే॥ వోవోయోగాగుమ్మా - సంధియేమోనాకూదెలుపావే॥౨౩॥ పదియూదళమూల పద్మామందూ-ఆరువేలూ ఆడీఅతనూ- హంసుడు-పదిఅంగుళాలు-అమ్మరో అనహాతామెకూర్చనే॥ వోవో-ముక్తికాంతా-పవనుడుకూరాడూచుండూనే॥౨౪॥ పావానూడూ కూరాడుచూ అనహాతాయెటులాయుండూ-అమ్మరో ఆవిధమూ దెలుపావే॥ వోవోయోగాగుమ్మా-ఆలసించాక అంతూదెలుపావే॥ ౨౫॥ అమ్మా వినవే ముక్తికాంతా- అనహాతాస్తానామూనందూ॥ లింగముద్ర॥ పద్మముండు పండ్రెండూదళమూలా-వోవోముక్తికాంతా- నడమపవనూడమరీ యుండూనే॥ ౨౬॥ పండ్రెండూదళమూలా పద్మానడమాయుండీ పావానూడూ- యెంతావరకూ సంచారించూనే॥ వోవోయోగాగుమ్మా- వెలదిరో నాకెరుకాపరచావే॥ ౨౭॥ పండ్రెండూదళమూలా పద్మానడమాయుండీ పావానూడూ - హంసుడు ఆరువేలూఆడూనే॥ వోవోముక్తికాంతా - విచ్చావిడిగా సంచారించూనే॥ ౨౮॥ ముక్తికాంత॥ యోగగుమ్మా- యేమమ్మా - మహాదేవీ - అనాహతస్తానమందున - ఆరువేలహంసలు ఆడేటప్పుడు ఆ స య మం దు న యే దే వు ని కి పూజ

జేసినావో చెప్పవమ్మా॥ యోగగుమ్మ॥ అమ్మా- అనాహతస్థానమందున ఆరువేలు ఆడేటప్పుడు - ఆరుద్రమూర్తైన - మహాదేవునికి పూజజేసీనా నమ్మా- పూలుపత్రితో॥ ముక్తికాంత॥ యేమంత్రముచేతపూజచేసినావు- రుద్రమూర్తికి॥ యోగగుమ్మ॥ అయిఖ్యపంచాక్షరిచేత పూజజేసీనానమ్మా- మహాదేవి॥ ముక్తికాంత॥ అహా రుద్రమూర్తిసామ్మేనమ్మా - అదీ- నాకు సంతోషమాయె॥

యాలలు॥ అనహతా పద్మామూనందూ- విచ్చావిడిగా సంచారిం చీ అందునుంచీ యెందుబోవూనే॥ వోవోయోగగుమ్మా సూక్ష్మసూక్ష్మ మూనాకూ దెలుపావే॥ ౨౯॥ అనహతాపాద్మామూనందూ - విచ్చా లిడీగా సంచారించీ-హంసుడు పండ్రెండు అంగుళాలు- విరివిగా పీశుద్ధా మెకూ-నే- వోవోముక్తికాంతా-హంసుడు ఆవిధమూనుండూనే॥ ౩౦॥ విచ్చాలిడిగా సంచారించీ- విశూద్ధానహంసూడతనూ - యెన్నివిధమూల సంచారించూనే- వోవోయోగగుమ్మా-వెలదిరో ఆకేలూదెలుపావే॥ ౩౧॥ అమ్మావినవే ముక్తికాంతా-విశూధస్థానామూనందూ॥ వశ్చముద్ర॥ పద్మ ముందు పదియారూదళమూ- వోవోముక్తికాంతా- నడమపవనూడాడూ చుండూనే॥ ౩౨॥ పదియారుదళమూలా పద్మానడమూయుండ హంసూ డతనూ - యెంతవరకూ సంచారించూనే- వోవోయోగాగుమ్మా- వేగమె నాకెరుకాపరచావే॥ ౩౩॥ పదియారు దళమూలా పద్మానడమా యుండీ హంసూడతనూ-పదియునూర్లూ ఆడూచుండూనే॥ వోవోముక్తికాంతా- శుద్ధమందూ సంచారించూనే॥ ౩౪॥ ముక్తికాంతా॥ యోగగుమ్మా-యేమ మ్మ మహాదేవీ విశుద్ధస్థానమందున పదినూర్లహంసలు ఆడేటప్పుడు ఆసమ యమందున యేదేవునికి పూజజేసినావో చెప్పవమ్మా॥ యోగగుమ్మ॥ అమ్మా విశుద్ధస్థానమందున పదినూర్లు ఆడేటప్పుడు ఆయీశ్వరమూర్తైన మహాదేవునికి పూజజేసినానమ్మా పూలుపత్రితో॥ ముక్తికాంత॥ యేమం త్రముచేత పూజజేసినావు యీశ్వరమూర్తికి॥ యోగగుమ్మ॥ ప్రసాద పం చాక్షరిచేత పూజజేసినానమ్మ॥ మహాదేవి॥ ముక్తికాంత అహా యీశ్వర మూర్తి సామ్మేనమ్మా అది నాకు సంతోషమాయె॥

యాలలు.

శుద్ధామాందూసంచారించీ సుదతీరో ఆపావానూడూ- అందూనుం చే యెందూబోవూనె॥ వోవో యోగాగుమ్మా॥ వనితారో ఆవైలూ దెలు

పావే॥ ౩౫॥ శుద్ధామందూసంచారించీ సూటీదప్పాక పావనూడూ- హం
సుడుపదిఅంగుళాలు అమ్మరో ఆజ్ఞేయామెకూర్చనె॥ హోహోముక్తికాంతా॥
నాశికాగ్రమునడమానిలుచూనే॥ ౩౬॥ సంచారించీ పావానూడూ సూటీ
దప్పాకఆజ్ఞేయూనా- యెటులయుండునో యెరుకాపరచావే॥ హోహోయో
గాగుమ్మా॥ కీలకామూనాకూదెలపావే॥ ౩౭॥ అమ్మావినవే ముక్తికాం
తాఆజ్ఞేయస్థానామూనందూ॥ ప్రకాశ ముద్ర॥ రెండుదళమూల పద్మముం
డూనే॥ హోహోముక్తికాంతా॥ నడమపవను డమరీయుండూనే॥ ౩౮॥ రెం
డూరేకూలపద్మామందూనడమూపవనూడమరీయుండీ- యెంతకోలదీసంచా
రించూనే॥ హోహో యోగాగుమ్మా॥ కీలుయేమో చాలాదెలుపావే॥ ౩౯॥
రెండూరేకూలకమలామందూ నడమాయుండీపావానూడూ - పదియునూ
రై ఆడూచుండూనె॥హోహోముక్తికాంతా॥పద్మమందేసంచారించూనే॥౪౦॥

ముక్తికాంత॥ యోగగుమ్మా యేమమ్మా మహాదేవి॥ రెండురేకుల
కమలమందు పదియునూరై పరమహంసలుఆడేటప్పుడు ఆసమయమందున
యేదేవునికి పూజచేశినావో చెప్పవమ్మా॥ యోగ గుమ్మ॥ అమ్మా రెండు
రేకులకమలమందున పదియునూరై ఆడేటప్పుడు ఆసదాశివమూర్తైన మహా
దేవునికి పూజ చేశినానమ్మా పూలుపత్రితో॥ ముక్తికాంత॥ యేమంత్రం
చాత పూజచేశినావు సదాశివమూర్తికి॥ యోగగుమ్మ॥ గురుప్రసాద పం
చాక్షరిచాత పూజచేశినానమ్మా మహాదేవి॥ ముక్తికాంత॥ ఆహాసదాశివ
మూర్తిసౌమ్యనమ్మా అది నాకుసంతోషమాయ॥

ఉయూలలు.

రెండూరేకులపద్మామందు సంచారించిహంసూడతనూ - అందూ
నుంచీమెందూబోవూనే॥ హోహోయోగాగుమ్మా॥ వెలదీరో నాకెరుకాపర
చావే॥ ౪౧॥ రెండూరేకుల పద్మామందూ సంచారించీ హంసూడతనూ-
హంసుడు కపాలపర్యంతం చాలగసహస్రారా మెకూర్చనే॥ హోహోముక్తి
కాంతా॥ హంసూడుఆవిధమూనుండూనే॥ ౪౨॥ పద్మామూలో సంచా
రించీ హంసూడతనూసహస్రారానా - యెటులనుండూనో యెరుకాపర
చావే॥హోహోయోగాగుమ్మా॥ సంధియేమోచాలాదెలుపావే॥౪౩॥అమ్మా
వినవేముక్తికాంతా సహస్రారాస్థానామూవందూ॥ఆకాశముద్ర॥ వేయు
రేకులకమలాముండూనే॥ హోహోముక్తికాంతా॥ నడమపవనూ డమరీయుం
డూనె॥ ౪౪॥ వేయూరేకుల కమలామందూ నడమూపవనూడమరీయుండీ

యంతకొలదీసంచారించూనే॥ వోవోయోగాగుమ్మా॥ కన్నెరో ఆకేలు దెల్పు పావే॥ ౪౫॥ వేయూరేకులకమలామందూ నడమాయుండీ పావానూడూ-హంసుడుదళశతమూలాడునే॥ వోవో ముక్తికాంతా ॥ అందుపైనా నిలచీయున్నావూ॥ ౪౬॥

ముక్తికాంత॥ యోగగుమ్మా యేమమ్మా మహాదేవి॥ సహస్రార కమలమందు హంసుడుదళశతంగా హంసలుఆడేటప్పుడు ఆసమయమందున యేదేవునికిపూజచేశినావో చెప్పవమ్మ॥ యోగగుమ్మ॥ అమ్మా సహస్రార కమలమందున హంసుడుదళశతంగా ఆడేటప్పుడు ఆసద్గురుస్వామైన మహాదేవునికి పూజచేశినానమ్మ పూలుపత్రితో॥ ముక్తికాంత॥ యేమంత్రంచాత పూజచేశినావు సద్గురుస్వామికి॥ యోగగుమ్మ॥ యెతిమూల పంచాక్షరిచాతపూజచేశినానమ్మా మహాదేవి॥ ముక్తికాంత॥ ఆహాసద్గురుస్వామిడే నమ్మ అదినాకు సంతోషమాయా॥

యాలలు.

ఆరూస్థానామూలూదాటీ అనుభావామూ తెలుసూకోనీ - నీలో నీవూ యెటులాయున్నావూ॥ వోవో యోగాగుమ్మా ॥ నిష్ఠతో నానాకూ దెలుపావే॥ ౪౭॥ తొమ్మిదీ వాకింద్లామూశీ త్రోయాజాక్షీ తలుపూదీశీ-తొంగిచూచీనిన్నూగంటీనీ॥ వోవోముక్తికాంతా॥ కన్నతల్లినిఙ్గలయావస్తీనీ॥ ౪౮॥ యోగాగుమ్మాఅనియేపేరూ చెల్లూనమ్మా చెలియానీకూ- మల్లెమొల్లాలుకొల్లాలాడావే॥ వోవోయోగాగుమ్మా॥ అమ్మరో షురువంపూ బొమ్మావే॥ ౪౯॥ ఆరూస్థానామూలూదాటీఅలశీవొచ్చినానూయిపుడూ-అమ్మరోనాకమృతామివ్వావే॥ వోవోముక్తికాంతా॥ శక్తిగోనే శరణుజేశేనూ॥ ౫౦॥ మెచ్చితీనే యోగాగుమ్మా యిచ్చితీనె అమృతా మిపుడూ-తాగావమ్మాతరణామందూనా॥ వోవో యోగాగుమ్మా॥ జనన మరణము లేనిసొమ్మిదీ॥ ౫౧॥ శరణూజేసి శలపూదీసుక - అ(రూ తమెత్తి యోగాగుమ్మా - అమృతపానము జేసినిలచానూ- ఆయోగాగుమ్మా అంతాటతానిండీయుండేగా॥ ౫౨॥ ఆరూస్థానామూలూచాటీ । అలశీవొచ్చినాదే చెలియా । చెలియకూశారీలు యివ్వారే । వోవో చెలియాలారా పన్నుగా నఙ్గన్నాతల్లికి॥ ౫౩॥ వేయారమ్మా యోగాగుమ్మాకు వెండీ సురటీలు చాతాబట్టీ । పుయ్యారమ్మా అగరూగంధామూ । వోవో సఖియాలారా। తియ్యారమ్మాద్రిష్టి పరిహారం॥

వచనం. అనియిట్లుపలికిన ముక్తికాంతపలుకులకు ఆనందించి ఆ చెలియ యిట్లనియె.

యోగకుమ్మ చూర్ణిక.

వెరుకలకాంబోజి॥ శ్రీమత్ మహాదేవి శక్తిశంకరి బాగీరధి త్రిలంబిక మోక్షలక్ష్మి పాలలోచని శాంభవి పరమకళ్యాణీ। వజ్రవైడూర్య మరకత మాణిక్య నీలగోమేధిక పుష్యరాగభరణీ। మణిగణఖచిత రచిత కూర్మ సింహాసనాధీశ్వరీ। సాంమ్రాజ్యదురంధరీ। జాజి విరజాజి మల్లె మొల్ల సంపంగి పారుజాతకుసుమ పూజాదురంధరీ। అనంతలక్షణ లక్ష్మి గుణగణశ్రేష్టి। సురగరుడోరగ యక్షరాక్షస కిన్నరకింపురుష సిద్ధవిద్యాధరీ। మహారాంబిక సేవ్యమానా। పాదారవిందశక్తి। అత్తరుపన్నీరు పునుగుజవ్వాజి శ్రీగంధగవిళె ఖచ్చూర కేయూర పచ్చకురువేరు కల్పపరిమళ గంధసువాసినీ। చతుర్దశభువనాది ప్రత్యుద్ధాన నిత్యాభ్యుదయ విసేషీ। చండమార్తాండమండల దర్శనోత్సాహ। మార్తాండమండలనివాసినీ। శుకబీజతేజోర్జిజ విరాజి పరంజ్యోతిస్వరూపిణి। యింద్రనీల పచ్చకెంపు తళుకు మణిమయఖచిత యుచిత చతుర్రత్న కిరీటశారదా। అతల వితల సుతల రసాతల తలాతల మహాతల పాతాళ ప్రౌఢిజగజ్జననీ। యీరేడు యుక్త భూలోక భువర్లోక సువర్లోక మహర్లోక మర్త్యలోక తపోలోక సత్యలోక సాంమ్రాజ్యలక్ష్మి। భువనేశ్వరీ। సనకసనందన సనత్కుమార శుకశౌనక ప్రముఖశేవక మనోహారవింద సందోహ నిష్యంద మకరందపాన। సతతాళచిత్తమిళించా। తత్సన్నిళించాయమాన। శాంభవీ। శ్రీమద్రాజరాజేశ్వరీ। ఛత్రచామర ఆల్వట యింజామరశౌరి పట్టుముత్యాల గొడుగు భూచక్ర పగులొత్తిదీటి పచ్చిపూలు చల్లినపరంజ్యోతీ। ఏకార్తి ద్వియార్తి త్రియార్తి చతురార్తి పంచార్తి షడార్తి సప్తార్తి అష్టార్తి నవార్తి దశార్తి ఏకాదశార్తి ద్వాదశార్తి త్రయోదశార్తి చతుర్దశార్తి పౌర్ణమార్తి పరిపూర్ణషోడశార్తి పరమార్తిగలిగిన పతితపావనీ। దీనదయాళీ। దీనపోషకీ దీనరక్షకీ భక్తపోషకీ భక్తరక్షణీ పరమకల్యాణీ। పావనచరితే మున్నమునులకు రుషులకు యోగులకు వేత్తలకు ముక్తీపదమిచ్చి రక్షించిన ముక్తిసంధాయనీ। చూడామణీ। బగళాముఖీ। బాలామణీ। పరరాజాత్మకీ చరాచరజంతుసంతాన సముచ్చరణ। సంకల్ప నిర్వికల్ప బహుగుణ ప్రకల్పిత। ప్రకృతిరూపిణీ। పంచరూప శతరూప సహ

స్వరూప సర్వరూప సచ్చిదానందస్వరూపిణీ ముప్పైమూడు బిరుదులు చెల్లిన మాతామహమ్మాయి అనంతకోటిబహుయోగ భావయోగ ఆత్మజీవాత్మ పూర్ణాత్మ శతాత్మ సహస్రాత్మ అనంతాత్మ సర్వాత్మ వీరశక్తి విఖ్యాతనామ దివ్యనామక కాంతామణీ నిష్కళంక నిర్వాణి నిర్వికల్పి వికల్పాది వినోదీ ముక్తికాంత శిరోమణీ నమస్తే నమస్తే నమోనమః॥

ద్విపద॥ శ్రీయోగగుమ్మట్లు సొంపుగా యిట్లు వివరించి చూర్ణిక విశదంబుగాను చెప్పస్తోత్రించిన చెవులపండుగను। వినిముక్తికాంతయూ విస్మయంబొంది। దేహముపులకించి కంపాయమొందీ నందమైభరితమై నమితమైతోచి। పరవశత్వమునొంది పావనగాత్రి వుప్పొంగిఆత్మలో పూ హించుచున్న। పన్నీరుముఖమున పణతులుజల్లి జలతారు పైయ్యెదచెరుగు నవార్తి। సాంబ్రాణిధూపముల్ సఖియలువేసి। జయజయశబ్దముతోకంచు నఖార। కూచిచేసినకాంత మూర్ఛయుదెలసి। కన్నిచ్చి ఆయోగగుమ్మ నుజూడ। భృత్యురాలై చాల కరములుమోడ్చి నోసలంటిశరణార్థి నిష్టతో జేయ। ముక్తికాంతయుబలికే ముక్తిసంధాయి మునులలో ఘనులలో ముద నొప్పమీర। యతులలో మతులలో వెతకిచూచినను। లేరమ్మనీసరివారల లోనా॥

[illegible]॥ అనుచూబలికీ ముక్తికాంతా అలరూచు తానాత్మాసఖి [illegible] ముద్దూలాడేగా-ఆముక్తికాంతా-ముద్రబెట్టూకయిచ్చేటా [illegible] వెుదూలారా చూడారమ్మా - యోగాగుమ్మా చకారాదన [illegible] చలగూచున్నాదీ - వోవో చెలియాలారా - చెన్ను [illegible] న్నాదీ॥ ౫౬॥ యోగాగుమ్మా మోమూజూచీ - వున్నామ [illegible] గే - పూర్ణవతినీబాగాచూడారే॥ వోవోసుదతూలారా [illegible] చీకలయారే॥ ౫౭॥ చెలియాలవుడూ చెన్నుమీరగ- చేతు [illegible] జేశే అమ్మారో మేమెంతావారామూ॥ మముగన్నతల్లి యోగ [illegible] వెంచీ మూడానూ॥ ౫౮॥ యేమేబాలా యోగాగుమ్మా - యోగీభోగీ [illegible] వై - భక్తిముక్తితో బెరయూచున్నావా॥ వోవో యోగాగుమ్మా- భావమందేనన్నూగన్నావా॥ ౫౯॥ అమ్మారో నీతోడలాపైనా పవ్వళిం చీపండీయుంటే - సోనావానగురి శేవిధమేమీ వోవోముక్తికాంతా - సొం పుమేమో నాకూజెలుపావే॥ ౬౦॥ చెలియావినవే యోగాగుమ్మా- [illegible]

బ్రహ్మాండలామూనుంచి- అమృతమెపుడూ గురియూచుండూనే హోహో యోగాగుమ్మా - తాగవమ్మాతరుణితమిదీరా॥౬౧॥

వచనం. అనియిట్లు ముక్తికాంత యోగగుమ్మతో ముచ్చటాడె సమయమందున॥ పద్మాక్షి నీలవేణినిపిలుచుట॥ నీలవేణీ యేమమ్మా పద్మాక్షీ ముక్తికాంత శిరోమణి యోగగుమ్మతో అయిక్యసంధాన ముచ్చటాడు చున్నది. మనములాలిపాటబాడి ద్రిష్టిపరిహారంశాయవలెనట॥ జ్ఞానశిరోమణులను పిలువవమ్మా ముక్తికాంత వుత్తరువు అయినదీ యోగగుమ్మ మనస్సు అఖండముగా నిలుపుకొని ముక్తికాంతలో అయిక్యమౌతూయున్నది. త్వరగా తోడితేవమ్మావారినీ॥ నీలవేణీ॥ జ్ఞానశిరోమణులను పిలుచుట॥ నారీమణీ హంసయానా అమలాక్షీ జ్ఞానరత్నమా పావనచరితా పద్మావతీ జ్ఞానాంబా హేమాక్షీ యేమమ్మానీలవేణీ మీరందరు త్వరగా నిటురాండీ వొస్తూయున్నామమ్మా మహాదేవి ముక్తికాంత శిరోమణికి యోగగుమ్మకు పాటబాడి మంగళహారతి ద్రిష్టిపరిహారంచేయవలెనట. మనమంతాగూడిపోదామురాండెమ్మా జ్ఞానశిరోమణులారా త్వరగాద్రిష్టి తియ్యవలెనూ వొస్తూయున్నామమ్మా నీలవేణీ॥నీలవేణీ॥ పద్మాక్షీ వొచ్చినారమ్మ జ్ఞానశిరోమణులు॥ పద్మాక్షి॥ లక్ష్మీకాంతా యేమమ్మా పద్మాక్షీ॥ పద్మాక్షి కనకకలశముపైన పచ్చల పళ్ళెరంబెట్టి పసపు కలకజేసి జ్యోతిముట్టించి పాటలుబాడరమ్మా అట్లాగెనమ్మా॥

పద్మినీస్త్రీలు లాలిపాటబాడుట.

ఆది - తోడి - లాలిపాట.

లాలిలాలోయమ్మా। మనయోగాగుమ్మా! భాక్తిమేలోయమ్మా। మెప్పొపుమధుగ్రోలుగ్రోలునమ్మా। లాలిలాలిమనయోగగుమ్మకూ।ముక్తికాంతకు మూలవిరాటుకూ॥ లాలిలా॥౧॥ చాలుచాలోయమ్మా సద్గురుణీకరుణా వేడుకలాయనమ్మా। అమృతాముయెపుడు గ్రోలుగ్రోలోయమ్మా। చాలుచాలుసద్గురుణిప్రేమయు మేలుమేలు మాకెప్పటికాత్మలో॥ లాలిలాలో॥ ౨॥ పాలుపాలోయమ్మా। ఫలమూనయోగం వాలలాడెనమ్మా। సైయ్యామా యోగంసమకూడెనమ్మా। పాలుపాలుయనిచాలగసైయ్యాము। బాగుగజూచిన యోగగుమ్మకూ లాలిలాలోయమ్మా॥ అన్నఅన్నావమ్మా ఆనాడు చెవినావిన్న విన్నావమ్మా। కారాణగురుణీ కన్నకన్నావమ్మా కన్నకన్నయీ సన్నబిళంబున పూలలోయున్నా పురుషోత్తముని॥

లాలిలా॥ మూలవిరాటోయమ్మా భక్తులబ్రోచే భూరిదయాళోయమ్మా। తనభక్తులానువేలువేలునమ్మా। మూలవిరాటే ముక్తిదాయకీ భక్తులనేలిన పరమదయాళికే॥ లాలి॥ కోలహాలమమ్మా। యీయోగాద్భుతూ- మేలు మేలోయమ్మా । సహస్రారమందూ వాలలాడెనమ్మా । కోలహాలముగ యోగగుమ్మతో ముచ్చటలాడే ముక్తికాంతకూ । రాలిలాలోయమ్మా॥

సౌరాష్ట్రి - ఆటతాళము - మంగళహారతీ.

జయమంగళం నిత్యశుభమంగళం జయాజెయమంగళం సదాశుభమంగళం॥ కరుణయిచ్చిన గురుణి కనిశించిఆత్మలో । కలసితివి సొలబైన కమలమందూ । కమలమధ్యంబునను కనకచేవెలిగేటి । కళలు హెచ్చిన యోగగుమ్మకిపుడూ॥ జయమంగ॥ పుట్టితివి నీవొకటి-భూమిపైనరపుట్టు । పుట్టితివి ఘట్టిగా సమితిపుట్టూ । పట్టితివిసద్గురుణి పాదామేగతియనీ । మెచ్చితిమి పరమందు ముచ్చటగనూ॥ జయమంగళం॥ సత్తుచిత్తులయందు సమరసము దెలుసుకొని । వొత్తిలేనివెలుగువెలిగితివిగా । వెలుగులో మెలగున్న వేదసారముగన్న । సత్తైనశ్రీయోగగుమ్మకిపుడూ॥ జయ॥ గురుకరుణచేతను వొరుకచెట్టెకటి-యు చెట్టెకటి-ఘట్టిగాపట్టిచూచీ । పూపిందెలు కాయపండైనపక్వమును । తత్వమున గన్నట్టి సత్యవతికీ॥ జయమంగళం నిత్యశుభమంగళం॥

ముక్తికాంత॥ అమ్మాపద్మాక్షీ॥ యేమమ్మా ముక్తికాంత శిరోమణీ యికటడనె యున్నానమ్మ మహాదేవీ నేనొకటి మంగళహారతి చెప్పెద జ్ఞానశిరోమణులు నీవు కలశి మంగళహారతియివ్వరమ్మ యోగగుమ్మకూ॥ అట్లాగెనమ్మా పూలదుశాల్వలు పునుగుజవ్వాజి పూలతొడవులు పూలపంకాలు పూలదండలు త్వరగా తీసుకరాండీ తెచ్చినామమ్మా మహాదేవి పచ్చలపళ్లెరములో పసపు కలకచేసినారా, చేసినాము. కనక కలశముపైన పెట్టినారాపళ్లెరము, పెట్టినాము. అయితే నేను చెప్పినట్లు క్రమముగా మంగళహారతి యివ్వండమ్మా జ్ఞానశిరోమణులారా.

ముక్తికాంత జ్ఞానశిరోమణులకు మంగళహారతి చెప్పుట.

ఆది - శుద్ధసావేరి - మంగళహారతి.

మంగాళామనుచుపాడారే- మనయోగాగుమ్మకు - మంగాళామనుచుపాడారే॥ మంగాళామనుచుపాడారె మగువాలందారుగూడి - శృంగారామైనట్టిసుదతీసద్గుణశాలికీ॥ మంగా॥ స్తానాస్తానములుదాటినా - యీత

రణమందుతల్లి నిపోడగనినా- స్తానాస్తానాములుదాటి తల్లిని పోడగనినా- మతంల్పావల్లి కిపరిమెళ గంధాముగలదీ యిపుడూ॥మంగా॥ త్రివేణిసంగా మంటూనా- యీతరణమందు- పొంగిస్తానామూజేశినా- త్రివేణిసంగమం దుపొంగిస్తానాము జేశి- గంగాసరాస్వతితో ఘనతాపొందిన దేవికీ॥ మంగా॥ అలశీవొచ్చినఅమ్మకూ- పూబోణులారా పూలాపంకాలూయీవారే- అల శివొచ్చినఅమ్మనుకలశీపూబోణులారా - పూలాపంకాలుయీవారే మేలూ మేలనుచూడలచీ॥ మంగా॥ పూలా దండాలు దొడగరే - సంపూర్ణావతికి- పునుగుజవ్వాజిపుయ్యరే- పూలా దండాలుదొడిగి పునుగు జవ్వాజి బూశి- పూలామశాల్వలూ పుష్యావతిపైవైచీ॥ మంగాళ॥

ఈప్రకారంబున క్రమముగా మంగళహారతి యిచ్చి యోగగుమ్మకు ద్రిష్టితీశి పరిహారించి పద్మినీస్త్రీలనుయిటురమ్మని ముక్తికాంతయోగగుమ్మ నుకొనియాడుట.

చాపువే నిజాంగి భక్తప్రసంగి చాపువే నిజాంగి॥ పరమాంతరంగి చాపువేనిజాంగి పరమయోగాంగి॥ చాపువేనిజాంగి పటుతగాపాంగి యని కొనియాడి దేవాదిదేవపుడు నినుమెచ్చినానమ్మ నిజయోగగుమ్మ నినుమెచ్చి నానమ్మ నికకొదవేమి యేమిగోరెద వడుగు మిచ్చెదనని నామహాదేవితో నపుడిట్టులనియె.

జలలు॥ శరణుశరణు దేవిరాజి శరణుశరణుజనని దేహి- శరణు దేవ తారాజి శరణువేదాంతవేద్య- యెన్ని జన్మములనునిన్ను యేనుపూజ జేశి నానో- కన్నులారనిన్ను జూడ గలిగెనెపవిత్రమయితీ॥ ౧॥ నెన్ని నెన్ని జన్మ ములను యెత్తుధరణిమహిమనిచట - నన్ను కరుణజూడు ముక్తికాంత దేవి శంఖరీ- శరణుకాంతమణుల కెల్ల కైవల్యమివ్వటంచు - శరణుజేశ నుగిణి యోగగుమ్మ కాంతశిరోమణి॥

ద్విపద॥ చేతులుజోడించిశరణాక్తిజేశి। పాలలోచనవీవుభక్తపోష కివీ। హరహరాయన్నపుడె అరమర లేక । ఆపదవట్టుద్రోచె ఆదిశంఖరివీ। చిత్తమునననుదలవశ్రీఘ్రంబువొచ్చి । భక్తులరక్షించె వాలాక్షివమ్మ । మహా దేవియన్నపుడె మహాత్ములకపుడు। అమృతంబుయిచ్చేటిఆనందివమ్మ। అని యిట్లుస్తోత్రంచి అమ్మనువేడి। దండంబు నర్పించి తగనిట్టులనియె॥ యోగ

గుమ్మ॥ అమ్మా పాలలోచనీ పరమకల్యాణి రాజ రాజేశ్వరి ముక్తికాంత శిరోమణీ శరణార్థి, నేనొకటి వినయంబు జేసెద నామీద కటాక్షముంచి చెవులఆలించుము మహాదేవీ॥ ముక్తికాంత॥ యేమో చెప్పవమ్మా యోగ గుమ్మా॥ యోగగుమ్మ॥ యిపుడీజ్ఞానశిరోమణులందరికి కైవల్యమిచ్చి రక్షించుమని ప్రార్థించెద॥ ముక్తికాంత॥ యోగగుమ్మకు కైవల్యాభావం దెలుపుట॥ ముక్తికాంత॥ యోగగుమ్మా వీరికియేమికైవల్యమిచ్చేదనమ్మా కైవల్యమనగా యెటువంటిది వీరిభక్తిభావనేకైవల్యంగురుభక్తే కైవల్యం గురుదక్షిణేకైవల్యం గురుపూజేకైవల్యం గురువిశ్వాసములందు యామారకుండుటేకైవల్యం గురునకు నాల్గుశిశ్రూషలు చేసినదే కైవల్యం గురుకోరిన వాస్తువతెచ్చియిచ్చినదే కైవల్యం మనస్సుగురువందు అఖండముగా నిలిపినదేకైవల్యం మనస్సుచెలింపకున్నదే కైవల్యం గురువును ధిక్కరించకున్నదేకైవల్యం గురుశావే కైవల్యం గురువాజ్ఞ మీరకున్నదే కైవల్యం గురుమంత్రధ్యానమే కైవల్యం నా దరిశనమే కైవల్యం సహస్రారము కంటె నాకంటె కారణకైలాస కైవల్య పరమ పదమున్నదే లేదని పెద్దలు నిశ్చయించినారుగనుక కారణకైలాసకైవల్యం యిచేనమ్మా సుగీణీ యోగగుమ్మా॥ యోగగుమ్మ॥ తల్లీ అపరాధిని తెలియకమవవిచేసుకున్న మీరు తెల్పియచెప్పితిరి సంతోష మాయను. ఇట్లు ముక్తికాంత యోగగుమ్మ ఆనంద వాక్యములు భాషింపుచున్న సమయమందున జ్ఞానశిరోమణులు దవళంబులు పాడిరట యెటువలెనూ॥

శ్రీకరపుణ్యశరీరి। ప్రాకటశైవోద్ధారీ।జోకగుణతత్వవిచారి। చెల్లి, నెసుగిణీభళిరే॥ ౧॥ ముక్తికాంతకుభక్తివై। సుబ్బగురుణికిశిష్యివై । వసుమతిభక్తులుమెచ్చా। మెసగితివార్యులు హెచ్చా॥ ౨॥ జయజయయోగాగుమ్మా। జయజయబంగరుబొమ్మా । జయజయ సకలశుభాంగీ । జయజయ, సుగుణీసంగీ॥ 3॥ పొంగిన మహిమము నెగడా। ముక్తికాంతతో గూడా, సంగమైయున్నదిజూడా। నిజగుమ్మనీకాంతలుపొగడా॥ ౪॥

వచనం॥ ఇట్లు దవళంబులు చదివి వుప్పొంగుచు జ్ఞాన శిరోమణులు ఆనందింపుచున్న సమయమందున.

ద్విపద.

మహాదేవి యెపుడు సమ్మదచిత్త యగుచు । వారలందరితో కైవల్యమిదెయనుచు । చెప్పి శెలవిచ్చిన శరణార్థిజేశి । నిజముగా కైవల్య

మిదియేనటంచు। యింతకంటెనువేరే కైవల్యముండె। లేదుపదరమ్మనీపద్మి నిస్త్రీలు। పదపడిముక్తికాంతకుశావజేశే॥

మాలిని.

శ్రీగంగా ధర అంగవైరి గౌరీ నాధా।
మంగళకర గరళకంఠ భృంగీశ్వరహారా।
యిందుధరా నందీవాహన సుందరరూపా।
వందనమేనొనర్చెద ముందుగనీపదములకును ముదముదలిర్ప॥

గద్య.

ఇది శ్రీమదఖిల విద్యత్కవి జేగీయమాన సరస కవితానంత విశేషానంత జగదార్చన మహాతత్వశిద్ధియుక్తగల వేదాంతగ్రంథములో వుదహారించిన ఆత్మస్వరూపిణి జ్ఞానస్వరూపిణి అను అక్క చెల్లెలి వేదాంత సంవాదంబునందు ఆత్మస్వరూపిణి అయిన అక్క జ్ఞాన స్వరూపిణి అనే చెల్లెలికి బోధించిన సహస్రార గ్రంథములో సూర్య మండలముయొక్క మహాత్యము దానిప్రకాశమానము అష్టదళముల పద్మమహాత్యము యీపద్మమందుండిన బీజాక్షరముల మహాత్యము సూర్యబింబముయొక్క దేదీప్యమానము సూర్యమండలముకు పోవుటకు అగ్నిజ్వాలలు మహాప్రకాశముగ తేజరిల్లుచున్నది సునాయాసముగా పొయ్యేమర్మము తెలుపమని అడగడము అష్టాక్షరిమంత్రం నీకు తెలుసుగదా యీమంత్రమునువుచ్చరిస్తు యెక్కమని చెప్పడము వాదిగాగలఅష్టమస్కంధములో వివరించి యిందులోనే నవమస్కంధము వివరించడమైనది యీ నవమస్కంధములోవుండిన సహస్రార మహాత్యము నాకు చెప్పుమని జ్ఞానస్వరూపిణి అయినచెల్లెలు ఆత్మస్వరూపిణిఅనే అక్కనుప్రార్థించడము ఆ మెసహస్రారములో వేయురేకులకమలమున్నదనిన్నీ దానికాంతి కోటిసూర్య ప్రకాశమన మనిన్నీ జాత్మశక్తి యందుఓంకారబీజమని చెప్పడము యిట్లుచెప్పిన పలుకులుఆలకించి సహస్రారముదర్శించి అచట అనేక భూషణాలంకృతుండైన సద్గురుస్వామిని దర్శించడము ఆసద్గురుస్వామికి పూజచేయుడము వేయురేకులకమలమందు

అనేకప్రకాశమానముగా తొలుకరి మెరుపువలె ధళాయిస్తువుండే ముక్తికాంతను దర్శించడము ముక్తికాంత పూజాభరణము ముక్తికాంత యోగగుమ్మడు అమృతమివ్వడము అమృతపానము చేయడమునాదిగాగల మహాత్యములు సూక్ష్మమూర్తి తపోప్రభావమువల్ల వేదాంతగ్రంథముగా సహస్రారము నవమస్కంధముగా నేర్పరచి విరాటు శ్రీవిశ్వబ్రహ్మ అయిన సద్గురుస్వామికి అర్పితముగా నిర్మాయించిన సహస్రారము

సంపూర్ణము.

---

సీసము॥ గంగాధరుకరుణచే గంగాయపల్లెనూ
పురమొకటియు గలదు పృధివిలోను ।
ఆపురియందునా సూక్ష్మమూర్తియను పేర
సుబ్బగురుకరుణచే సుస్థిరముగా ।
ఆలాయమొకటీ వాలాయముగగట్టి
పాలలోచనునిల్పె చాలగాను ।
ఆలింగమూర్తికీ చాలంగ పూజలూ
చలుపుచునుంటిని సరసనగుచూ ॥

ఇట్టిమహాత్మ్యరాలనె ఘట్టీగాను ।
గొలుచుచుండంగ పార్వరమణుడపుడు ।
సహస్రారమహిమను వివరించుమనిచెప్ప ।
చెప్పబూనితినేను యీచరితమిపుడూ ॥

ద్విపద.

శ్రీలక్ష్మికాంతునీ చిత్తంబునందు
భక్తియువదలక పరిపూర్ణులగుచూ
సారంబుగలిగిన సహస్రారమహిమ
హరికృపచే యేను ధరణిలోపలను
వరుసతో సద్గురుపదములుగోరి
వర్ణనజేసితి పూర్ణులై మీరు

కర్ణములొగ్గియు ఘనతమీరంగ
వినుచునుండెడువారు యిహమందునెపుడు
సకల సుఖంబుల సన్నుతికెక్కి
ఆమీద వైకుంఠమందుండగలరు
వ్రాసినవారికి వరశుభోన్నతులు
శ్రీహరికరుణచే సిరులెల్లగలిగి
వర్ధిల్లగలరు సిద్ధంబుగానెపుడు
యెందాక కులగిరు లెందాక తార
లెందాక రవిచంద్రు లెందాక భూమి
నందాక యీచరిత మవనిలోపలను
సుస్థిరంబుగనుండు విస్తరంబుగసూ.

మంగళం.

సహాస్రారవర్ణన అనే వేదాంతయక్షగానము

సంపూర్ణము.

---

| పుట. | పంక్తి. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| 14 | 18 | చాయిమ్మేలు | చాలయిమ్మేలు |
| ,, | 19 | కటిసూ | కటిస్సూ |
| 18 | 27 | దేహాముత్తోపదళి | దేహాముత్తోపదదళి |
| 47 | 3 | అమ్మానీపూవన్ని | అమ్మానీవన్ని |
| ,, | 5 | కంటేస్రా | కంటెయా |
| 53 | 18 | చెప్పవమ్మ | చెప్పవమ్మ |
| 66 | 17 | ద్రాక్ష | రుద్రాక్ష |
| ,, | 23 | తఌచు | తలుచుడి |
| 70 | 1 | గగగా | గగనా |
| 71 | 24 | చేసినమ్మా. | చేసినవమ్మా |
| 80 | 16 | దేవుడై | దేవుడైన |
| 83 | 8 | స్వాధీషా | స్వాధీష్టా |
| 84 | 20 | అవహాతా | అనహాతా నా |
| 85 | 15 | దళమూ | దళమూలా |
| 87 | 15 | నిషతో | నిష్ఠతో |
| 95 | 18 | పార్శ్వరను | పార్శ్వేతి |